# భక్తి గీత సుధ

(108 సంకీర్తనలు)







పరిష్కరణ :

ఆచార్య కెజె కృష్ణమూర్తి

ప్రచురణ



తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి

# భక్తి గీత సుధ

రచన

## మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ

సాధారణ సంపాదకుడు :

**బి.యస్. రెడ్డి (భూమన్)**

సంచాలకుడు, తి.తి.దే. "శ్వేత", తిరుపతి




పరిష్కరణ : ఆచార్య కె.జె. కృష్ణమూర్తి
తరిగొండ వెంగమాంబ వాఙ్మయ ప్రాజెక్ట్
తి.తి.దే. "శ్వేత" తిరుపతి

ప్రచురణ

**కార్యనిర్వహణాధికారి**

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**

**2007**

BHAKTIGĪTA SUDHA

MĀTṚŚRĪ TARIGOṆḌA VEṄGAMĀMBA

Edited by

**Prof. K.J. Krishnamoorthy**

Tarigoṇḍa Veṅgamāmba Vāṅmaya Project

"SVETA", T.T.D., TIRUPATI.

TTD "SVETA" Religious Publications Series No : 6



First Edition: 2007

Copies : 5000

Price :

Published by

**K.V. RAMANACHARI,** I.A.S.,

Executive Officer,

Tirumala Tirupati Devasthanams,

TIRUPATI - 517 507

Printed at

**Sri Parasarya Press**

Sri Vyasasramam

Ph: 08578-287528

# నామాట

శ్రీనివాసుణ్ణి కావ్య కుసుమాలతో ఆరాధించి, తరించిన సాహితీమూర్తుల్లో అగ్రగణ్యురాలైన మహాకవయిత్రి మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ.

ఆ స్వయంవ్యక్త అర్చామూర్తి యొక్క నామధేయాన్నే సవదరించి, ఆ దేవదేవుని సాన్నిధ్యంలో సహస్ర మాసాల నిండు జీవితాన్ని సార్థకంగా పండించుకొన్న ఈ సుకృతి రచన లన్నింటినీ సముద్ధరించే సంకల్పంతో తిరుమల తిరుపతి దేవస్థానం ఆమె పేరున ఒక వాఙ్మయ ప్రాజెక్టును శాశ్వతంగా నెలకొల్పింది.

"శ్వేత" సంస్థ సంచాలకులు శ్రీ భూమన్ గారి నేతృత్వంలో ఈ వాఙ్మయ ప్రాజెక్టు అచిర కాలంలోనే ఏ డెనిమిది పుస్తకాల ప్రచురణలను, ఎంపికచేసిన పాటల ఆరు సి.డి. లను ఆవిష్కరింప చేయడం చాలా ముదావహమైన విషయం.

వెంగమాంబ రచనలన్నీ మధురకవితా సరస్వతీ మందిరంలో వెలుగొందుతూ వున్న అక్షరమణిదీపికలు! ఈ కవయిత్రీ శిరోమణి రచించిన యక్షగానకృతుల్లో ప్రముఖమైన గీతాలను ఎంపికచేసి, ఆశు కవితలుగా జాలువారిన మరికొన్ని వేదాంత తత్త్వకీర్తనలతో పాటుగా "భక్తి గీత సుధ" - అనే పేరిట నూటయెనిమిది గేయాలతో వెలువరిస్తున్న ఈ సుందర గీత సంకలనం సహృదయ పాఠకుల, గాయనీ గాయకుల, శ్రోతల ఆమోదాన్ని పొందగలదని హార్దికంగా ఆకాంక్షిస్తున్నాను.

ఇదే రీతిగా ఈ వాఙ్మయ పరిష్కరణ ప్రాజెక్టు ఈ భాగవత కవయిత్రి రచనలను అన్నింటినీ సుపరిష్కృత రూపంలో ప్రచురింపచేయవలెనని కోరుతున్నాను.

శ్రీనివాసుని దివ్యానుగ్రహంచేత ఈ వాఙ్మయ పరిష్కరణ ప్రాజెక్టు ఇతోధికంగా వాఙ్మయ ఫలాలను సహృదయ పాఠక లోకానికి అందజేయగలదని మా ఆశంస.

తిరుపతి

జూన్ 4, 2007

**కె.వి. రమణాచారి**

శ్రీకార్యనిర్వహణాధికారివర్యులు

తిరుమల తిరుపతి దేవస్థానములు.

# మనవి

తెలుగులో అన్నమయ్య తరువాత రాశిలోనూ, వాసిలోనూ విష్ణు సాహిత్యాన్ని విరివిగా అందించిన మహాకవయిత్రి మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ. వెంగమాంబ 'తెలుగు మీరా'గా సుప్రసిద్ధురాలై, పోతనతో సాటియైన భక్తకవయిత్రిగా ప్రస్తుతింపబడింది.

శ్రీనివాసుణ్ణి రసరమ్యములైన కావ్యకుసుమాలతో పూజించి తరించిన సుమధుర సారస్వతమూర్తి తరిగొండ వెంగమాంబ. ఈ కవయిత్రి రచనలు శ్రీవేంకటేశ్వరుని సాహితీ మందిరంలో వెలిగించిన అఖండ దీపాలు. ఆ దీప కళికల కాంతులు ఈనాటికీ నిరంతరం ఆ తిరుమలేశుని దివ్య వైభవాన్ని అక్షరంగా ప్రకాశింప జేస్తున్నాయి.

తిరుపతికి పశ్చిమాన 100 కి.మీ. దూరంలో తరిగొండ గ్రామంలో ప్రభవించి, మధురకవితా సుధాధారలతో శ్రీ వేంకటేశుని అభిషేకించి తరించిన తెలుగు కవయిత్రి, అఖిలాంధ్ర జనయిత్రి తరిగొండ వెంగమాంబ.

సాంఘిక దురాచారాలపై సమరం ప్రకటించి, బాల వితంతువులపై ఆ నాడు జరిగే అన్యాయాలను ప్రతిఘటించి- తనకోసం కాదు- తనవంటి అభాగినులపై సంప్రదాయం పేరిట జరిగే అమానుష కృత్యాలను ఎదిరించి, తిరుగుబాటు బావుటా ఎగురవేసిన విప్లవవనిత వెంగమాంబ.

అనేకానేక ప్రక్రియలలో శతకాలు, యక్షగానాలు, ద్విపదలు, తత్త్వ సంబంధమయిన రచనలు, శ్రుతి, లయ సమన్వితములైన వేదాంతగీతాలు వెలయించటమేగాక, శ్రీ వేంకటాచలమాహాత్మ్యంవంటి బృహత్‌కావ్యములను రచించిన విదుషీమణి వెంగమాంబ.

శ్రీతరిగొండ వెంగమాంబ విశిష్ట వ్యక్తిత్వాన్ని పసిగట్టిన అప్పటి తిరుమల-తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారి, గౌరవనీయులు, సంస్కారి శ్రీ ఏ.పి.వి.యన్.శర్మ, ఐ.ఏ.యస్., గారు ఈ కవయిత్రి రచనలను పరిష్కరించి, ప్రచురించుటకుగాను 'తరిగొండ వెంగమాంబ వాఙ్మయప్రాజెక్టు'ను ఏర్పరచి అందుకు పరిష్కర్తగా శ్రీ కె.జె.కృష్ణమూర్తిగారిని నియమించినారు. ఆ ప్రాజెక్టు "శ్వేత" ఆధ్వర్యంలో

పనిచేసేట్టుగా ఆదేశించినారు. స్వయాన సాహితీప్రియుణ్ణి అయిన నాకు తరిగొండ వెంగమాంబను గురించి తెలుసుకునే అవకాశం ఈ రకంగా కలిగింది.

ఈ కవయిత్రి సాహిత్యంమీద 2007 జనవరి 3,4 తేదీలలో రెండు రోజులు జాతీయ సాహితీసదస్సు ఘనంగా నిర్వహించినాము. నాకు తెలిసి చరిత్రలో ఇది తొలి సదస్సు. అనంతరం 2007 ఏప్రిల్ 29,30 తేదీల్లో వెంగమాంబ జయంతి ఉత్సవాలను ప్రప్రథమంగా రెండు రోజుల పాటు తరిగొండ, తిరుమల, తిరుపతులలో పెక్కు సంగీత, సాహిత్య కార్యక్రమాలతో వైభవోపేతంగా నిర్వహించటం జరిగింది. ఈ జయంతి ఉత్సవాలలో వెంగమాంబ రచించిన ఐదు పుస్తకాలను ఐదు పాటల ఆడియో సి.డి.లను ఘనంగా ఆవిష్కరింపచేయడం జరిగింది.

వెంగమాంబ రచించిన ప్రసిద్ధ యక్షగానాలనుండి ఆమె ఆశువుగా రచించిన తత్త్వకీర్తనలు, స్తుతిగేయాలు, పద్యాలు మున్నగువాటి నుండి ఎంపికచేయబడిన నూట ఎనిమిది భక్తిరస భరితాలైన గీతాల సుందర సంకలనం "భక్తి గీత సుధ".

ఈ పుస్తకాన్ని తీసుకురావటంలో మా ప్రియతమ కార్యనిర్వహణాధికారి, ఉత్సాహవంతులు, మంచి చొరవ కలిగిన సాహిత్యాభిలాషి, సహృదయులు శ్రీమాన్ కె.వి. రమణాచారి, ఐ.ఏ.యస్., గారు చక్కని ప్రోత్సాహాన్నిస్తున్నారు. తరిగొండ వెంగమాంబ సాహిత్యాన్నిగూర్చి ప్రచారం చేయటానికి ఇటువంటి ప్రచురణలు, సదస్సులు బాగా ఉపకరిస్తాయి. తరిగొండ వెంగమాంబ సదస్సుల నిర్వహణలోనే కాకుండా, తరిగొండను తిరుమల తిరుపతి దేవస్థానం దత్తత తీసుకోవటంలోనూ విశేషమైన చొరవ తీసుకొన్నవారు శ్రీ కె.వి. రమణాచారిగారు. వారికి నా ధన్యవాదాలు.

ఈ బృహత్ కార్యక్రమము సఫలీకృతం కావటానికి కారకులైన మా ప్రియతమ కార్యనిర్వహణాధికారి. శ్రీ కె.వి. రమణాచారిగారికి, తెలుగు సాహితీ, సంగీత ప్రియుల పక్షాన ధన్యవాదాలు.

**బి. యస్. రెడ్డి**
సంచాలకులు
**"శ్వేత"**

# పీఠిక

తెనుగు సాహితీజగత్తులో విలసిల్లిన మహాకవుల్లో అనేకులు కృతిరచనమే ప్రధాన లక్ష్యంగా జీవితం సాగించిన మహానుభావులు. మఱికొందరు తమ జీవితమే కవితాకళతో మమేకంగా మనుగడ సాగిస్తూ కావ్యసృష్టి కావించిన మహనీయులు. బమ్మెర పోతనామాత్యుడు, తాళ్లపాక అన్నమాచార్యులు, తరిగొండ వెంగమాంబ మున్నగువారు ఈ శ్రేణికి చెందిన సహజ సారస్వత మూర్తులు.

బాల్యంలోనే అపూర్వంగా అక్షరశారదా సాక్షాత్కారాన్ని పొందిన కారణంగా మాతృశ్రీ వెంగమాంబ పలికిన ప్రతి పలుకూ పాటగానో, పద్యంగానో రూపొందింది. అమలినమైన దైవభక్తి అంతర్లీనంగా ఉన్న కవితాశక్తిని దివ్యంగా, భవ్యంగా పరిమళింపచేయటంద్వారా ఈ కవయిత్రీమతల్లి ఆదినుండీ తాను ఆలాపించిన దివ్యకవితాగానం అష్టాదశ రచనల రూపేణ వాఙ్మయ ప్రపంచంలో అక్షరంగా విరాజిల్లుతున్నది.

ఈ ఆశుకవయిత్రి రచించిన కృతుల్లో యక్షగానాలు ఇంచుమించు పది ఉన్నాయి. వీటిలో జలక్రీడా విలాసం, విష్ణు పారిజాతం, బాలకృష్ణ నాటకం, శివనాటకం– సుప్రసిద్ధాలు. ఈ నాటకాల్లోనుండి ఎంపిక చేసిన రసవంతములైన గీతాలకు, ఈ కవయిత్రి ఆ యా సందర్భాల్లో ఆశువుగా ప్రవచించిన తత్త్వకీర్తనలను, మరికొన్ని స్తుతులను, గేయాలను చేర్చి– మొత్తం నూట ఎనిమిది సంఖ్యగా సమకూర్చడం ద్వారా– ఈ "భక్తి గీత సుధ" రూపొందింది.

ఇందులో చోటుచేసుకొన్న గీతాలన్నీ వస్తువు, భాష, శైలి– ఇత్యాది అంశాలలో మిగుల వైవిధ్యం కలవై, సంగీత సాహిత్యాల్లో ఈ కవయిత్రికి గల ప్రతిభనూ, వైదుష్యాన్నీ చక్కగా చాటుతూవున్నాయి.

ఇందలి ఆశరచనలలో కొన్ని వెంగమాంబ తుంబురుకోనలో ఉండినప్పటి దివ్యానుభూతులను వెల్లడిస్తున్నాయి; మరికొన్ని గేయాలు ఆధ్యాత్మిక జగత్తులో

ఈ 'కవితాతపస్విని' సమపార్జించిన విశిష్ట జ్ఞానాన్ని వేనోళ్ళ ధ్వనింప చేస్తూవున్నాయి.

ఈ "భక్తి గీత సుధ"లో చిట్టచివరి 'ముత్యాలహారతి' గీతం పరమయోగి చూడామణియైన పెరియాళ్వారుల (శ్రీమద్విష్ణుచిత్తుల) "తిరుప్పల్లాండు"వలె శ్రీమద అలమేలుమంగా వేంకటేశ్వరులకు, ఆ దివ్యదంపతులకు నెలవై యున్న శేషాద్రికీ మంగళాశాసనం ఆలాపించడంలో అద్వితీయంగా సార్థకత నొందింది.

ఈ "భక్తిగీతసుధ" ఈ విధంగా రూపుదిద్దుకొనటంలో ప్రధాన ప్రోత్సాహకులు "శ్వేత" సంచాలకులు, సుగృహీత నామధేయులైన శ్రీ భూమన్ గారు. వారి ప్రోత్సాహంతో ఇలాంటి రచనలు అనేకంగా ఈ వాఙ్మయప్రాజెక్టు పక్షాన క్రమంగా వెలుగుచూడనున్నాయి.

--కె.జె. కృష్ణమూర్తి

# కలు

తిరుపతి ఉత్సవాల్లో మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ సారస్వతాన్నిగూర్చి ఉపన్యసించే సదవకాశాన్ని కల్పించటం ద్వారా ఈ వాఙ్మయ పరిష్కరణ ప్రాజెక్టుకు మూలవిరాట్టుగా అంకురార్పణ కావించిన సహృదయవతంసులు తిరుమల తిరుపతి దేవస్థాన పాలకమండలి అధ్యక్షవర్యులు శ్రీ భూమన కరుణాకరరెడ్డి మహోదయులకు, తిరుమల తిరుపతి దేవస్థాన పాలకమండలి సభ్యులెల్లరకు నా అనేక హార్ధిక ధన్యవాదములు.

మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ వాఙ్మయ పరిష్కరణ ప్రాజెక్టు రూపొందటంలో మూలకారణులయిన సహృదయవతంసులు, అప్పటి తి.తి.దే. శ్రీకార్యనిర్వహణాధికారివర్యులు, సుగృహీతనామధేయులు శ్రీ ఎ.పి.వి.ఎన్. శర్మ, ఐ.ఏ.యస్., మహోదయులకు, శ్రీవారి ప్రతినిధులు, స్మితపూర్వభాషులు, తరిగొండ వెంగమాంబ వాఙ్మయ ప్రాజెక్టుకు శాశ్వతస్థితిని ప్రసాదించిన సహృదయవతంసులు; తి.తి.దే. శ్రీకార్యనిర్వహణాధికారివర్యులు సుగృహీతనామ ధేయులు శ్రీ కె.వి. రమణాచారి, ఐ.ఏ.యస్., మహోదయులకు నా అనేక ధన్యవాదములు.

తిరుమలలో సంయుక్త కార్యనిర్వహణాధికారి శ్రీ జి. బలరామయ్య, ఐ.ఏ.యస్.,గారు, తిరుపతిలో సంయుక్తకార్యనిర్వహణాధికారి శ్రీఎన్.శ్రీకాంత్, ఐ.ఏ.యస్.,గారు– ఈ ఉన్నతాధికారు లిరువురకు నా అనేక హార్ధిక ధన్యవాదములు.

మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ వాఙ్మయ పరిష్కరణ ప్రాజెక్టుయొక్క సర్వతోముఖమైన వికాసానికి తమ ఉద్యమస్ఫూర్తిని ప్రసాదించి, ఉత్సాహ, ప్రభుశక్తి పూరితమైన దక్షతతో ముందుకు నడిపిస్తూవున్న తి.తి.దే. "శ్వేత" సంస్థ సంచాలకులు, సహృదయవతంసులు, "భూమన్"గా సుగృహీత నామధేయు లయిన శ్రీ భూమన్ సుబ్రహ్మణ్యంరెడ్డి మహోదయులకు నా అనేక హార్ధిక ధన్యవాదములు.

తి.తి.దే. పౌరసంబంధాధికారివర్యులు సరసహృదయులు శ్రీయుతులు కె.రామ్‌పుల్లారెడ్డిగారికి నా అనేక హార్దిక కృతజ్ఞతాభివాదములు.

టి.టి.డి. "శ్వేత" కేంద్రగ్రంథాలయం లైబ్రేరియన్ సోదరీమణి శ్రీమతి ఎన్. లీలావతిగారికి, వారి సహాయోద్యోగులయిన మిత్రబృంద మందరికీ-

"శ్వేత" సంస్థ కార్యాలయం సూపరిండెంటెంట్ శ్రీ వి. దామోదరం గారికి, శ్రీ దీనదయాళ్ (యు.డి.సి.) గారికి, వారి సహోద్యోగిబృందమందరికీ, మిత్రుడు శ్రీ జి. సురేష్‌కుమార్ (యు.డి.సి) గారికి-

"శ్వేత" సంస్థ కో-ఆర్డినేటర్స్ శ్రీ పి. రమణారెడ్డిగారికి, మిత్రుడు డా॥ యన్.యస్. బాలాజీరావుగారికి, తదితర మిత్రులందరకూ-

నా అనేక హార్దిక కృతజ్ఞతాభినందనములు.

శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధనసంస్థ డైరెక్టర్ ఆచార్య వి. వేంకటరమణారెడ్డిగారికి, వారి సహోద్యోగులకు అనేక హార్దిక కృతజ్ఞతాభినందనములు.

ఈ పుస్తకమును ముచ్చటగా ముద్రించిన శ్రీవ్యాసాశ్రమము (ఏర్పేడు) శ్రీపారాశర్య ముద్రణాలయము వారికి నా హార్దిక కృతజ్ఞతాభినందనములు.

మాతృశ్రీ తరిగొండవెంగమాంబాకవయిత్రియొక్క ఆరాధ్య దైవమయిన "శ్రీతరిగొండ శేషకుధరాధ్యక్షు"నకు నా భక్తిపూర్వక ప్రణామాంజలి.

--కె.జె. కృష్ణమూర్తి

## 1

విషయము : ఇష్టదేవతా ప్రార్థన (జలక్రీడావిలాసము)

**దరువు, నాట రాగం - జంపె తాళం**

శ్రీ రుక్మిణీలోల! – శృంగార సుఖలీల!
కారుణ్య రసమూల! – కనకరుచిచేలా!
సూరి జననుత శీల! – సురుచిర గుణజాల!
ఘోరదనుజ విఘాల! – గోపాల బాలా!
॥ జయ జయా – జయ జయా, జయ జయా – జయ జయా॥ 1

పరిపూర్ణ విజ్ఞాన! – భావ దివ్య ధ్యాన!
పరవశాత్మాధీన! – భక్తసంతానా!
సురమునీంద్ర నిధాన! – శోభితాహిశయాన!
పరమాంబర స్థాన! – బ్రహ్మాభిధానా! ॥జయజయా॥ 2

వరద! తరిగొండ పుర – వాస! శేషగిరీశ!
వరనీల సంకాశ! – వనధిజాధీశా!
సరసాత్మ! జగదీశ! – సాధుహృదయ నివేశ!
ద్విరదరిపు మదనాశ! – దేవదేవేశా! ॥జయ జయా॥ 3

## 2

విషయము : ఇష్టదేవతా ప్రార్థన (జలక్రీడా విలాసము)

**మధ్యమావతి రాగం - ఆది తాళం**

నంద నందన! తే - నమో నమో ॥పల్లవి॥

సా, నందహృదయ! తే - నమో నమో
నందనందన! తే - నమో నమో ॥ఉపపల్లవి॥

నారాయణ! పరిపూర్ణ సుధాకరవద
నా! మాధవ! తే నమో నమో
నారద సనక సనందన నుత పద
నళినయుగళ! తే నమో నమో ॥నంద నందన! తే॥ 1

సమర విభీషణ! సజ్జన పోషణ!
విమల చరిత! తే నమో నమో
కమనీయాంగ! వికార విరహిత! వి
నమదుద్ధర! నమో నమో ॥నంద నందన! తే॥ 2

వర తరిగొండ నివాస! పరాత్పర!
నరమృగవర! తే నమో నమో
గురుతర పన్నగగిరినాయక! బహు
నరపూజిత! తే నమో నమో ॥నంద నందన! తే॥ 3

## 3

విషయము : గణనాయక స్తుతి (జలక్రీడా విలాసము)

### దరువు, ఆట తాళం

గణనాయకా! శరణు - గణనాయకా! శరణు
గణనాయకా! శరణు - గణనాయకా! ॥పల్లవి॥

శ్రీశివ వరపుత్ర! - చిరతర ఘనచిత్ర
కాశ! మమ్మేలు! శ్రీ - గణనాయకా! ॥గణ॥ 1

భవరోగ సంహార! - భక్త చిత్త విహార!
కవిజన మందార! - గణనాయకా! ॥గణ॥ 2

మునిజన పాలన! - మూషక వాహన!
ఘన సుగుణ సంతాన! - గణనాయకా! ॥గణ॥ 3

నీరధి గంభీర! - నిగమ గోచర! విశ్వ
కారణ విగ్రహా! - గణనాయకా! ॥గణ॥ 4

అలరార నిను నమ్మి - నటువంటి మాపాల
కలిగియుండుము నీవు - గణనాయకా! ॥గణ॥ 5

తాపత్రయంబును - తలఁగించి మముఁ బ్రోచి
కాపాడవయ్యా! శ్రీ - గణనాయకా! ॥గణ॥ 6

తలఁగక విఘ్నకా - రులఁ ద్రుంచి, బ్రహ్మ స
త్కళలో నన్నుంచు శ్రీ - గణనాయకా! ॥గణ॥ 7

ఆరూఢిఁ దరిగొండ - హరికి సోదరియైన
గౌరికుమార! శ్రీ - గణనాయకా! ॥గణ॥ 8

## 4

విషయము : బాలగోల స్మరణ (జలక్రీడా విలాసము)

### దరువు

బాల గోపాలం ॥పల్లవి॥

హే మానస! బాలగోపాలం భజే ॥ఉపపల్లవి॥

బాలగోపాలం - భర్మసుచేలం ॥బాల॥ 1

శ్రీసతి లోలం - భాసురచేలం ॥బాల॥ 2

మన్మథాకారం - మందరోద్ధారం ॥బాల॥ 3

నిగమ సంచారం - నిర్జరాధారం ॥బాల॥ 4

కౌస్తుభాభరణం - కంస సంహరణం ॥బాల॥ 5

తరిగొండాధీశం - తరణి సంకాశం ॥బాల॥ 6

## 5

విషయము : దేవతాస్త్రీల సంతోష సంభాషణ (శ్రీకృష్ణుడు అవతరించిన వేళలో- జలక్రీడావిలాసము)

### దరువు, ఆది తాళం

విష్ణుదేవుఁడు పుట్టెనమ్మా!
వసుదేవు నింట, విష్ణుదేవుఁడు పుట్టెనమ్మా! ॥పల్లవి॥

జిష్ణు ముఖామర సేవితుఁడై, వ - ర్ధిష్ణుం డగుచును
దేవకి కడుపున, విష్ణు - దేవుఁడు పుట్టెనమ్మా! ॥ఉపపల్లవి॥

దర, చక్ర, గద, సార - సములూ నాల్గు చేతుల
ధరియించి, మకరకుం - డలములూ

తఱచుగ గండ - స్థలముల వెలుఁగఁగ
నురుమణీ హారము - లురమున మెఱయఁగ ॥విష్ణు॥ 1

నీలజలద వర్ణముతోనూ, - విలసిత కనక
చేలకాంతు లుప్పొంగఁగానూ
మెలఁగు మకుటము - మీఁదట వలగొని
పూల సరంబులు - భుజముల నొరయఁగ ॥విష్ణు॥2

తరిగొండ నారసింహుఁ - డైన శేషాద్రి విభుఁడు
చిరతర బ్ర - హ్మానందమున
దొరకొని కుజనులఁ - దుఱుమాడుచు వరుసగ
సరవిని సుజనుల - సంరక్షింపను ॥విష్ణు॥3

## 6

*విషయము : దేవతల జయజయ ధ్వనులు (శ్రీకృష్ణావతార శుభవేళలో- జలక్రీడా విలాసము)*

### దరువు

విజయీా భవా! జయ - విజయీా భవా!
జయ విజయీా భవా! - దిగ్విజయీా భవా! ॥పల్లవి॥
అజ రుద్ర వందిత పా - దారవింద! ముకుంద!
సుజన మందార! స్వామి! - విజయీాభవా! ॥విజయీా॥ 1
కారుణ్య రస పారా - వార! వికార దూర!
వీరశేఖర! స్వామి! - విజయీా భవా! ॥విజయీా॥ 2
సలలిత తరిగొండ - నిలయ! శేషాచలేశ!
విలసిత చరిత! స్వామి! - విజయీా భవా! ॥విజయీా॥ 3

## 7

**విషయము : దేవతల ప్రశంసలు (శ్రీకృష్ణుడు జన్మించిన శుభవేళలో - జలక్రీడా విలాసము)**

### దరువు ( హెచ్చరికెలు, బహుపరాకులు)

బహుపరాకురా! హెచ్చరికె! - బహుపరాకురా!
హెచ్చరికె! బహుపరాకురా! - హెచ్చరికె! బహుపరాకురా! ॥పల్లవి॥

శ్రీలలనాలోల! విశ్వమూల! - కాలాతీత! మమ్ము
పాలించు! హెచ్చరికె! స్వామీ! - బహుపరాకురా! ॥బహు॥ 1

పరమ సాధువులఁ గొట్టి - బాధించే కంసునిఁబట్టి
పరిమార్చు! హెచ్చరికె! - స్వామీ! - బహుపరాకురా! ॥బహు॥ 2

అభయ మిచ్చి, తరిగొండ - హరి! భూభార మణఁగించి మా
ప్రభ నిల్పు! హెచ్చరికె! స్వామీ! - బహుపరాకురా! ॥బహు॥ 3

## 8

**విషయము : లాలిపాట (యశోద చెలికత్తెలు బంగారు తొట్లలోనున్న బాలకృష్ణునకు వీనుల విందుగా పాడినది - జలక్రీడా విలాసము)**

### లాలి

లాలి ముద్దుల బాల! - లాలి గోపాలా!
లాలి కాంచన చేల! - లలిత గుణజాలా! ॥లాలీ॥ 1

ప్రవిమలాచార! యా - దవ కులోద్ధారా!
కవిబృంద మందార! - కలికలుషదూరా! ॥లాలీ॥ 2

నంద నందన! సదా - నంద! గోవిందా!
సౌందర్య వదనార - వింద! ముకుందా! ॥లాలీ॥ 3

వర చిన్మయాకార! - వనధి గంభీరా!
నిరుపమగుణ హార! - నిగమ సంచారా! ॥లాలీ॥ 4

శైలజస్తుత నామ! - సంపూర్ణ కామా!
నీలమేఘ శ్యామ! - నిర్జర లలామా! ॥లాలీ॥ 5

తరిగొండపుర వాస! - తారక విలాసా!
చిరరమ్య దరహాస! - శ్రీ శ్రీనివాసా! ॥లాలీ॥ 6

## 9

**విషయము : జోలపాట (యశోద చెలికత్తెలు పాడినది - జలక్రీడా విలాసము)**

**దరువు, ఆది తాళం**

జోజో జోజో కృష్ణా! జోజోజో కృష్ణా! ॥పల్లవి॥

నీకు, వాజగాదు పోరుబెట్ట-వద్దు కృష్ణా! ॥జోజో॥ ఉపపల్లవి॥

చెలఁగుచు మా మోములు జూ - చేవు కృష్ణా!
నీవు, మొలక నవ్వులు నవ్వేవు - ముద్దు కృష్ణా! ॥జోజో॥ 1

వూచితే హాయిగా నూగు - చుండి కృష్ణా!
మే, మూచకుంటె వూకొట్టేవ? - వోరి! కృష్ణా! ॥జోజో॥ 2

తరిగొండ నారసింహుఁడు - దయను కృష్ణా!
నీకు, చిరతరాయు వియ్యవలె! - చిన్ని కృష్ణా! ॥జోజో॥ 3

## 10

**విషయము : శాపవిముక్తి పొందిన నలకూబర, మణిగ్రీవులు శ్రీకృష్ణుని స్తుతించటం (జలక్రీడా విలాసము)**

### దరువు

దండమూ స్వామి! - దండమూ ॥పల్లవి॥

పుండరీకాక్ష! బ్ర- హ్మాండ భాండోదర! ॥ఉపపల్లవి॥

నీ పాదములు సోఁక - ఁగా పాప మణఁగె; మా
శాపము దీఱె నో - గోపాల విగ్రహా! ॥దండమూ॥ 1

మునుపు నారదు శాప - మున వృక్ష రూపము
లను బూనియున్న మ - మ్మెనసి ప్రోచిన స్వామి! ॥దండమూ॥ 2

తరిగొండాధిప! శేష - గిరివాస! నీ పాద
స్మరణ మా కొసఁగు! భా - స్వర సచ్చిదానంద! ॥దండమూ॥ 3

## 11

**విషయము : శ్రీకృష్ణుని దివ్యనాట్య వర్ణన (కాళీయుని పడగలపై జలక్రీడా విలాసము)**

### దరువు - ఆది తాళం

ఆడెనే! కృష్ణుఁ - డాడెనే! ॥పల్లవి॥

పాడుచు ఆ గో - పాలకులందఱు తన
వేడుక చూడఁగ - వింతగ నగుచూ ॥ఆడెనే!॥ ఉపపల్లవి॥

తతకిట తకఝుం - తధిమి ధిమిత యని
గతులు, చొల్లు లతు - లితముగ మెఱయా ॥ఆడెనే!॥ 1

అలరుచు చిఱు గ - జ్జెలు, నూపురములు
ఘలు ఘలు ఘలు ఘలు- ఘల్లని మ్రోయా ॥ఆడెనే!॥ 2

ధాణు ధణంధణు - ధణిత యనుచు గీ
ర్వాణులు నభమున - వరుసగఁ బొగడా ॥ఆడెనే!॥ 3

మణి భూషణములు - మఱిమఱి కదలంగ
ఘణఘణయని మొల - ఘంటలు మొరయా ॥ఆడెనే!॥ 4

తారి తకిణ ఝుం - తకకిణ తకఝుం
తారి తకిటతక - తాతై యనుచూ ॥ఆడెనే!॥ 5

వర తరిగొండ ని - వాసుఁడు వేంకట
గిరినిలయుండగు - కృష్ణుఁడు చెలంగీ ॥ఆడెనే!॥ 6

## 12

విషయము : కాళీయుని పత్నులు శ్రీకృష్ణుని శరణువేడటం (జలక్రీడా విలాసము)

### దరువు (జావడి)

శరణు శరణూ నందాకుమారా! శరణు శరణూ ॥పల్లవి॥

శ్రీకర! దుర్జన - భీకర! వర మో
క్షాకర! పూర్ణ ని - శాకర వదనా! ॥శరణు॥ 1

సుందర విగ్రహా! - మందరధర! ముచు
కుంద వరద! గో - విందా! ముకుందా! ॥శరణు॥ 2

వర తరిగొండ ని - వాస! పరాత్పర!
గురుతర వేంకట - గిరి వర నిలయా! ॥శరణు॥ 3

## 13

విషయము : గోపికలు శ్రీకృష్ణుని మురళియొక్క అదృష్టాన్ని
కొనియాడటం (జలక్రీడా విలాసము)

### దరువు

ఏమి తపము cజేసెనమ్మా? - యీ మురళి పూర్వ
మేమి తపముc జేసెనమ్మా? ॥పల్లవి॥

హేమాంబరు నెపు - డెడcబాయక తగ
వేమఱు హరి మో - విని పొందెద నని॥యేమి తపము॥ ఉపపల్లవి॥

మునులకైనను పొందరాని - ఘనతర పదవి
మురళి కెక్కడ వచ్చె పూని?
వననిధి సుతకై - నను కలుగుట అరు
దని జను లెన్నుదు - రమరcగ ధరపై ॥ఏమి తపము॥ 1

తరిగొండ నారసింహుcడైనా - శేషాద్రి విభుని
కరుణ దానికి గల్గెc గానా
హరి యధరామృత - మిరవుగc గ్రోలెడి
గురుతర భాగ్యము - దొరకెను నిజముగ ॥ఏమి తపము॥ 2

## 14

విషయము : గోపికల జలక్రీడల వర్ణన (జలక్రీడా విలాసము)

### దరువు (కోలాట) - అట తాళం

హరికృష్ణ! హరికృష్ణ! - హరికృష్ణా! శరణని
అలరుచు కోలాట - లాడుదామా? ॥పల్లవి॥

ఝుమ్మని మన చికు - రమ్ములవలె నుండే
తుమ్మెద కొదమల - తోలుదామా? ॥హరికృష్ణ!॥ 1

మన వదనాముల కన్నను - మించేమని యుండే
వనజములను గోళ్ల - వ్రచ్చుదామా? ॥హరికృష్ణ!॥ 2

కళలాచే మన నేత్ర - ముల ధిక్కరించు ఈ
కలువరేకులఁ బట్టి - పులుముదామా? ॥హరికృష్ణ!॥ 3

పావనమగు మన - మోవి తేనెలవంటి
తావి మకరందము - త్రావుదామా? ॥హరికృష్ణ!॥ 4

ఒరపైన మన బా - హువులను హసించు తా
మర నాళములఁ ద్రుంచి - మరలుదామా? ॥హరికృష్ణ!॥ 5

గురుతరముగ మన - కుచముల గేలించి
మెఱయు జక్కవలను - తరుముదామా? ॥హరికృష్ణ!॥ 6

ముదమొప్ప మన హస్త - ములవలెఁ దగు కోక
నదమూలఁ గదలించి - అదుముదామా? ॥హరికృష్ణ!॥ 7

ధర మన పొక్కిళ్ల - కరణి వర్తువగాను
తిరుగు నీళ్ల సుళ్ల - నొరయుదామా? ॥హరికృష్ణ!॥ 8

పట్టుగ మన నితం - బముల పోలికె నుండు
నట్టి సైకతములం - దాడుదామా? ॥హరికృష్ణ!॥ 9

అలరఁగ మన పాద - ములవలె నిచ్చోట
కులికే కమఠములను - కొట్టుదామా? ॥హరికృష్ణ!॥ 10

రంగుగ పొంగు త - రంగ మాలికలపై
వొంగి వుయ్యల లూగు - చుందుదామా? ॥హరికృష్ణ!॥ 11

సమ్మతిగా సలి - లమ్ము లొండొరులపై
చిమ్మనగ్రోవులఁ - జిమ్ముదామా? ॥హరికృష్ణ!॥ 12

పోడిమి యేలలు - పాడుచు జోడుగా
వేడుకగా నీదు - లాడుదామా? ॥హరికృష్ణ!॥ 13

ఉల్లాస మలర యీ - చల్లాని జలమెత్తి
చిల్లుపొల్లుగ నెగఁ - జల్లుదామా? ॥హరికృష్ణ!॥ 14

దిట్టముగా ఈ - నది నీరు పై కుబ్బు
నట్టుగ సేతువు - గట్టుదామా? ॥హరికృష్ణ!॥ 15

శేషాద్రి పతియైన - శ్రీతరిగొండ నృ
సింహుని కృష్ణునిఁ - జేరుదామా? ॥హరికృష్ణ!॥ 16

15

**విషయము : కొలనిలో ఉన్న గోపికలు శ్రీకృష్ణుని ప్రార్థించటం**
**(జలక్రీడా విలాసము)**

## దరువు

దండమూ కృష్ణా! దండమూ ॥పల్లవి॥

అండజవాహన! .......... ॥పల్లవి॥
కుండలిశయన! బ్ర - హ్మాండ శరీరా! ॥దండమూ॥ 1

మందరగిరిధర! - సుందర విగ్రహ !
నందతనయ ! గో - విందా! ముకుందా! ॥దండమూ॥ 2

గురుతర వేంకట - గిరి నాయక!

తరిగొండాధీ - శ్వర! నరసింహా! ॥దండమూ॥ 3

## 16

విషయము : గోపాంగనలు గౌరీవ్రతం చివరన హారతియిస్తూ పాడిన మంగళము (జలక్రీడా విలాసము)

### దరువు ( జావిడి) - ఆది తాళం

శైలజాతాకూ గౌరికీ - జయ మంగళం ॥పల్లవి॥

శూలధరునా కభవూనాకు - శుభ మంగళం. శ్రీ॥శైలజాతాకూ॥

॥ఉపపల్లవి॥

మహిషాసుర సంహారిణికి - మౌనిజనోద్ధారిణికి

బహు చరాచర మాతకు - భవ్య మంగళం శ్రీ॥ శైలజాతాకూ॥ 1

సుగుణాభరణ ధారిణికి - సురసమూహోద్ధారిణికి

నిగమాంత సంచారిణికి - నిత్య మంగళం. శ్రీ॥శైలజాతాకూ॥ 2

తరిగొండ నరహరి సో - దరికి, శ్రీకంకాళినికి

సురుచిర సువాసినికి - శుభ మంగళం. శ్రీ॥శైలజాతాకూ॥ 3

## 17

విషయము : గోపికలు నాటకాంతంలో శ్రీకృష్ణుని ఉద్దేశించి పాడిన మంగళం (జలక్రీడా విలాసము)

### దరువు - ఆది తాళం

మాధవునకు - జయ మంగళం ॥పల్లవి॥

శ్రీ మహి నీళునకు - మంగళం ॥ఉపపల్లవి॥

విదుర వరదునకు - విశ్వంభరునకు
మదన జనకునకు - మంగళం
సదయ హృదయునకు - చపలాసురదు
ర్మద భంజనునకు - మంగళం ॥మాధవునకు॥ 1

సహజానంద ర - స స్వాంతునకును
మహిత చరితునకు - మంగళం
బహువిధ చేతన- భరితోదరునకు
మహిమాఢ్యునకును - మంగళం ॥మాధవునకు॥ 2

గురుతర వేంకట - గిరిపతియై మము
మరువని సామికి - మంగళం
తరిగొండా ధీ - శ్వరుఁడై మ మ్మే
మఱని నృహరికిని - మంగళం ॥మాధవునకు॥ 3

## 18

***విషయము : శృంగారవనంలో అదృశ్యుడైయున్న శ్రీకృష్ణుని ప్రసన్నుణ్ణి గమ్మని అష్టభార్యలు ప్రార్థించటం (విష్ణుపారిజాతము).***

### దరువు (పాహి పాహి)

పాహి పాహి సరోజ లోచన! - పాహి కలుష విమోచనా !
పాహి నిగమాగమ వివేచన ! - పాహి ఘన శుభ సూచనా!
॥పాహి॥ 1

పాహి శ్రీలలనా పరిగ్రహా! - పాహి సుందర విగ్రహా !
పాహి ఘోరసురారి నిగ్రహా! - పాహి దీనానుగ్రహా! ॥పాహి॥ 2

పాహి వరశేషాచలేశ్వర ! - పాహి నతవాణీశ్వరా !
పాహి జితదుర్మానవేశ్వర! - పాహి తరిగొండేశ్వరా! ॥పాహి॥ 3

## 19

విషయము : శృంగారవనంలో ప్రసన్నుడయిన శ్రీకృష్ణుణ్ణి అష్ట భార్యలు స్తుతించటం (విష్ణుపారిజాతము)

### దరువు

నంద నందన! కృష్ణా! - వందనం ॥పల్లవి॥
కుంద రదన! శర - దిందు వదన! శ్రీ
నంద నందన! కృష్ణా! - వందనం ॥అనుపల్లవి॥

మందరోద్ధారా! - మౌళి మందారా!
సుందరాకార ! ధీర! - సూరి విచారా ! ॥నంద నందన!॥ 1

పరిపూర్ణ కామా! - భండన భీమా!
సరసజలద శ్యామా! - జగదభిరామా! ॥నంద నందన!॥ 2

వర చిదాకాశా! వనధి నివేశా!
చిర తరిగొండాధీశా! శ్రీ వేంకటేశా! ॥నంద నందన!॥ 3

## 20

విషయము : శృంగారవనంలో రాధాదేవి రుక్మిణి మున్నగు అంగనలతో పల్కిన పల్కులు (విష్ణుపారిజాతము)

### దరువు - అట తాళం

హరి! కృష్ణ! హరి! కృష్ణ! - హరి! కృష్ణా! హరి! కృష్ణా!
హరి! కృష్ణా! యని - సరస మాడుదామా? ॥పల్లవి॥

ఈ వేళదనుక నీ- వెందు దాగితివోయి?
గోవింద! యని జడలం - గొట్టుదామా? ॥హరి! కృష్ణ!॥ 1

దవ్వు దవ్వుల నుండి - పువ్వుల బంతుల
రువ్వుచు పకపక - నవ్వుదామా? ॥హరి! కృష్ణ!॥ 2

లాలించి, బేలించి, - గేలించి, తేలించి
మేలు మోవి తేనెం - గ్రోలుదామా? ॥హరి! కృష్ణ!॥ 3

తప్పుం జేసితివని - రొప్పుచు దండించి
పుప్పొడి పైనిండ - గుప్పుదామా? ॥హరి! కృష్ణ!॥ 4

మల్లెలు, మొల్లలు - కొల్లలుగాం దెచ్చి
నల్లని సామిపైం - జల్లుదామా? ॥హరి! కృష్ణ!॥ 5

మక్కువం జేయుచుం - జిక్కించుకొని వీని
చెక్కిళ్లు మునిపంట - నొక్కుదామా? ॥హరి! కృష్ణ!॥ 6

ఎమ్మెలు చేయక - రమ్ము రమ్మని వీని
గొమ్మ పాలిండ్లను - గ్రుమ్ముదామా? ॥హరి! కృష్ణ!॥ 7

వేడుకగా హరికి - వీడెము లందిచ్చి
జోడు జోడుగ - కవ గూడుదామా? ॥హరి! కృష్ణ!॥ 8

తరిగొండాధిప! శేష - గిరివాస! శరణని
మురియుచు మురియుచు - మ్రొక్కుదామా? ॥హరి!కృష్ణ!॥ 9

## 21

విషయము : శృంగారవనంలో రాధ రుక్మిణి మున్నగు వారితో పల్కిన పల్కులు (విష్ణుపారిజాతము)

### దరువు

గిరిధామునిఁ గూడరే! – గిరిగిట్లంద ఱాడరే! 1

గోవిందునిఁ గూడరే ! – కోలాటా లంద ఱాడరే ! 2

గోపాలునిఁ గూడరే ! – గుడుగుడు గుంచా మాడరే ! 3

కంజాక్షునిఁ గూడరే! – కన్నాముచ్చిల్లాడరే ! 4

అచ్యుతునిఁ గూడరే ! – అమ్మన్న లిందాడరే ! 5

శ్రీనివాసునిఁ గూడరే ! – పూని పదములు పాడరే! 6

తరిగొండేశునిఁ గూడరే! – తిరిగి గొబ్బిళ్లాడరే! 7

## 22

విషయము : శృంగారవనంలో రాధ రుక్మిణి మొదలైన శ్రీకృష్ణుని పత్నులతో పల్కిన పల్కులు (విష్ణుపారిజాతము)

### గొబ్బిళ్ల పాట

శ్రీకృష్ణుఁ డాట్లాడి – యలసియున్నాఁడు చూడరే! ॥గొబ్బిళ్లో॥ 1

ఆటలు చాలించి వచ్చి – హరికి సేవ చేయరే! ॥గొబ్బిళ్లో॥ 2

విరుల పఱుపు పఱచి, చక్ర – ధరు నిచ్చోట నుంచరే!

॥గొబ్బిళ్లో॥ 3

చిఱు చెమట లారేటట్లు – చిగురుటాకుల విసరరే! ॥గొబ్బిళ్లో॥ 4

బడలి కెల్లాఁ దీర మోవి పానకము లియ్యరే! ॥గొబ్బిళ్లు॥ 5

విరిబంతులు కనుల నొత్తి - వీడెము లందియ్యరే! ॥గొబ్బిళ్లు॥ 6

మెత్తగ పాదపద్మము - లొత్తి సేద దేర్పరే! ॥గొబ్బిళ్లు॥ 7

హరిని నడుమ నుంచి - యంద తిరు గడల నిలువరే!
॥గొబ్బిళ్లు॥ 8

వీణెలు మీఁటి పాటలు - నాణెముగఁ బాడరే! ॥గొబ్బిళ్లు॥ 9

శ్రీనివాసునిఁ గౌఁగిటఁ - జేర్చి ముద్దు లియ్యరే! ॥గొబ్బిళ్లు॥ 10

తరిగొండాధిపతిమీఁద నం - దఱు యాలలు పాడరే!
॥గొబ్బిళ్లు॥ 11

## 23

*విషయము : శృంగారవనపాలికయైన వక్ర(వికట)భాషిణికి సత్యభామకు నడుమ నడచిన సంభాషణ (విష్ణుపారిజాతము)*

### దరువు - ఆది తాళం

కృష్ణునిఁ జూడలే - దేమమ్మా? ఓ భామా! మా
కృష్ణునిఁ జూడలే - దేమమ్మా? ॥పల్లవి॥

కృష్ణుని చిహ్నము - లేమమ్మా? ఓ భామా! మీ
కృష్ణుని చిహ్నము - లేమమ్మా? ॥కృష్ణుని॥ 1

నల్లాని మేనివాఁ- డోయమ్మా! కృష్ణుఁడు
చల్లాని చూపులా - వాఁడమ్మా! ॥కృష్ణుని॥ 2

ఇంకా యేమి గుర్తుల - వాఁడమ్మా? మీకృష్ణుని
పొంకాములన్నీ- దెలుపవమ్మా! ॥కృష్ణుని॥ 3

నవ్వు మోమువాఁ - డో యమ్మా! యే వేళ
వేణు నాదముఁ జేయు - చుండు నమ్మా! ॥కృష్ణుని॥ 4

ఎంతో సంతోష - మాయె నమ్మా! మీ కృష్ణుఁ
డిప్పు డెందుండుఁ? - దెలుపవమ్మా! ॥కృష్ణుని॥ 5

శ్రీతరిగొండ - నుండు నమ్మా! యే వేళ
ఘన శేషాద్రిపై న - టించు నమ్మా ! ॥కృష్ణుని ॥ 6

## 24

**విషయము : సత్యభామకు వక్ర(వికట)భాషిణికి నడుమ నడచిన సంభాషణ(విష్ణుపారిజాతము)**

### దరువు

పోయిరావే! కృష్ణుని కడకు - పోయిరావే! ॥పల్లవి॥

పోయిరావే! యిపుడు - జాగేలను ?
తోయధిశయనునిఁ - దోడ్కొని రావే ! ॥పోయిరావే!॥ 1

పోదునటవే? కృష్ణునిఁ బిలువఁ - బోదునటవే?
పోదునటవే? గొ- బ్బునఁ బద్మాక్షుని
సాదర హృదయుని - శౌరినిఁ బిలువఁ ॥బోదునటవే?॥ 2

ఆలస్యము చేయక - నిచటికి వన
మాలినిఁ దెచ్చిన - మంచిదె! చెలియా! ॥పోయిరావే!॥ 3

మందర ధరునిఁ - బు- రందర వినుతుని
నంద సుతుని గో - విందునిఁ బిలువఁ ॥బోదునటవే?॥4

ధీరుని జలధి గ- భీరుని జగదా
ధారుని నిగమ వి - హారునిఁ బిలువఁ ॥బోయిరావే!॥5
ఖ్యాతిగ శ్రీవేం - కటగిరి వాసుని
శ్రీతరిగొండన్ను - సింహునిఁ బిలువఁ ॥బోదునటవే?॥6

## 25

**విషయము : సత్యభామ చెలికత్తెతో పలికిన పలుకులు (విష్ణు పారిజాతము)**

### దరువు - ఆది తాళం

పదవే! పిలిచివత్తామూ గో - పాల బాలునీ ॥పల్లవి॥
ఇప్పుడూ, విదితముగా సకలమౌని - వినుత శీలునీ॥ ఉపపల్లవి॥

వలచీ, నన్ను వలపించిన - వాసుదేవుని, ఇప్పు
డలిగి, రాకయుండే మ - హానుభావునీ ॥పదవే!॥1

నా కొంగుబంగారమైన - నంద కుమారునీ, మా
శ్రీకామినీమణి విమల - చిత్త చోరునీ ॥పదవే!॥2

నన్నేలిన తరిగొండ - నరసింహుని, మా
వెన్నుని, గోవిందుని - వేంకటేశునీ ॥పదవే!॥3

## 26

**విషయము : సత్యభామ తన కలను చెలికత్తెకు చెప్పటం (విష్ణుపారిజాతము).**

**దరువు - ఆది తాళం**

కలకంఠి! కలఁగంటి నమ్మా! – కలఁ గన్న చంద
మలివేణి! చెప్పే వినవమ్మా! ॥పల్లవి॥
నెలఁతా! నా కల నేఁడెంతో – నిజముగ నుండునమ్మా!
॥ఉపపల్లవి॥

నలినాక్షుఁ డిందు వచ్చె – నమ్మా! లే లెమ్మనుచు
నను లేపి బుజ్జగించె నమ్మా!
కో కొమ్మని పువ్వుల చెండ్లు – చేతి కిచ్చె నమ్మా!
రా రమ్మని నన్నలమి – కౌఁగిలించెనమ్మా!
అలుకా వద్దని మదిలో – కలఁకా దీరిచినట్లు ॥కలకంఠి!॥ 1

ముద్దాగుమ్మ! రమ్మనె నమ్మా! నామీఁద నీ కీ
పద్దా లేమిటి?కనె నమ్మా! యీ లేని పోని
రద్దా లింక వద్దనె నమ్మా! నవ్వాచు మంచి
సుద్దాలు జెప్పుమనె నమ్మా!
కద్దు నీ మీఁద నెనరు,– కల్లగా దనినట్లు ॥కలకంఠి!॥ 2

తరుణీ! చింత యే?లనె నమ్మా! – శేషాచలాధీ
శ్వరుని ధ్యానింపుమనె నమ్మా! – తరిగొండ నర
హరి నిన్ను మెత్తుననె నమ్మా! – సురపారిజాత
తరువుఁ దెచ్చిత్తుననె నమ్మా!
'స్థిరముగఁ గృష్ణజపము నీ' – వనినట్ల కలికి! ॥ కలకంఠి!॥ 3

## 27

### విషయము : సత్యభామ వద్దకు వచ్చిన (సరస్వతి) యెఱుకత స్వరూపం (విష్ణుపారిజాతము)

### దరువు

వచ్చె నెఱుకతా ॥పల్లవి॥

వచ్చె నెఱుకో! యెఱుక! యనుచును–వాడవాడల వెంటనూ
హెచ్చుగా శ్రీసత్యభామిని–కెఱుక చెప్పెద ననుచునూ॥ఉపపల్లవి॥

సిరి గులుకు బంగారు పువ్వుల – చీర కుచ్చులు నెఱయఁగా
తఱచుగా దివ్యాభరణములు – ధళుకు ధళుకున మెఱయఁగా
ఉరుతరంబగు మణుల హారము – లురము మీఁదట నొరయఁగా
మురువు మీఱిన సంకుటుంగర – ములును బలు వగ మీఱఁగా
॥వచ్చె॥ 1

పెనఁగొనిన విరజాజి సరములు – బిళ్లకొప్పునఁ గదలఁగా
ఘనములై చెక్కిళ్ల పంజుల – కమ్మ లందము మీఱఁగా
మొనసి పెదవిని నాణిముత్తెపు – ముక్క రరుదై వెలుఁగఁగా
కనులఁ గాటుక, పచ్చ బొట్టును – గంధలేపన మమరఁగా
॥వచ్చె॥ 2

ఎఱుకడుగ రారమ్మనుచు ఘన – సరసిజాక్షులఁ బిలుచుచూ
పరఁగ జోలలు పాడి యూచుచు – బాలకుని ముద్దాడుచూ
శిరముపై బంగారు బుట్టినిఁ – జేత పలుమఱు నంటుచూ
సరవి శ్రీతరిగొండ హరి! ఫణి – గిరి నిలయ! శరణనుచునూ
॥వచ్చె॥ 3

## 28

విషయము : ఎఱుకత(కొరవంజి) తననుగూర్చి సత్యభామకు
తెలియజేయుటం (విష్ణుపారిజాతము)

### దరువు - ఆది తాళం

ఎఱుక చెప్పేవార మోమే! - యెఱుక చెప్పేవార మోమే!
ఎల్లా లోకములలో - నెఱుక చెప్పేవారము ॥పల్లవి॥

ధరకాట భరకాట, కల్ల - తబ్బిబ్బు గాకుండ, నిజము
నెఱుఁగఁ దగ్గవారి కెల్ల - నెఱుకఁ జెప్పేవారము ॥ఉపపల్లవి॥

లోకపాలకులకు, సు-శ్లోకులైన మౌనులకు
నేకాదశ రుద్రులాకు - నెఱుకఁ జెప్పేవారము ॥ఎఱుక॥ 1

అష్టా వసువులకు, ద్వాద - శాదిత్యుల, కవనిసురుల
కిష్టాముగా నిరత - మెఱుకఁ జెప్పేవారము ॥ఎఱుక॥ 2

సుర, సిద్ధ, చారణ, విద్యా - ధర, యక్ష, కిన్నర, భుజగ,
గరుడ, గంధర్వాదులకు - నెఱుకఁ జెప్పేవారము ॥ఎఱుక॥ 3

ఉరగశైలాధీశుఁడైన - తరిగొండ నారసింహుని
ఇరవుగాఁ బూజింపుఁడని - యెఱుకఁ జెప్పేవారము ॥ఎఱుక॥ 4

## 29

విషయము : సింగిని వెదకుతూ వస్తున్న సింగని(బ్రహ్మ)రాకను వివరిస్తున్న గేయమిది (విష్ణుపారిజాతము)

### దరువు - ఆది తాళం

సింగఁడు వచ్చానే యెఱుకల - సింగఁడు వచ్చానే ॥పల్లవి॥

కొంగాలఁ జంకానఁ బెట్టీ - గువ్వాల పిడికిటఁ బట్టీ
॥సింగఁడు॥ 1

మొలను కొడవలిఁ జెక్కుకుంటా - మొనసి గసిక లల్లుకుంటా
॥సింగఁడు॥ 2

తరిగొండేశ! శ్రీనివాస! - సరగునా సింగినిఁ జూపుమంటూ
॥సింగఁడు॥ 3

## 30

విషయము : శ్రీకృష్ణుడు పారిజాతవృక్షాన్ని తీసికొనిరావటం (విష్ణుపారిజాతము)

### దరువు - అట తాళం

జగదీశ్వరుఁడు వచ్చెనూ, - సత్యకు

పారిజాతముఁ గొని తెచ్చెనూ ॥పల్లవి॥

ఖగరాజుపై నెక్కి - గగన పథంబున

నెగసి, సురేంద్రుని - నగరములోఁ జొచ్చి॥జగదీశ్వరుఁడు॥ఉపపల్లవి॥

సురలు వెలుఁగు నొందఁగా, సమస్త ఖే -
చరులు సంతసమొందఁగా
తరుణితో మురియుచు - వనపారిజాతాఖ్య
తరువు వాసన దిగం - తరములా నిండఁగా ॥జగదీశ్వరుఁడు॥ 1

కనక చేలము మెఱయా, సర్వాంగము -
లను భూషణము లొరయా
మినమినా మెఱసేటి - మెఱుపులతో నీల
వనదము దిగఁబాఱి - వచ్చెనో యనినట్లు ॥జగదీశ్వరుఁడు॥ 2

గురుశేషాచలవాసుఁడు నృసింహుఁడు -
తరిగొండ పురధాముఁడూ
పరవాసుదేవుఁడు - భవ్య ప్రభావుఁడు
పరమ పవిత్రుఁడు - పంకజ నేత్రుఁడు ॥జగదీశ్వరుఁడు॥ 3

## 31

***విషయము : ఖేచరులు సదాశివుణ్ణి ప్రస్తుతించటం. (శ్రీకృష్ణుడు, దేవేంద్రుడు యుద్ధము చేయుచున్నచోటికి శివుడు వచ్చినప్పుడు - విష్ణుపారిజాతము)***

### దరువు - అట తాళం

పాహి సదాశివ! పాహి సదాశివ !
పాహి సదాశివ! - పాహి శివా ! ॥పల్లవి॥
శ్రీశ వాణీశ సు- రేశ సన్నుత !
చిత్ప్రకాశ! గౌరీశ! వి-శ్వేశ ! శివా ! ॥ఉపపల్లవి॥

చండప్రతాప! బ్ర - హ్మాండ స్వరూప!
శ్రీఖండేందుధర! నిత్యా - ఖండా! శివా ! ॥పాహి సదాశివ!॥ 1

భావజ సంహార! - భక్త మందార!
భావనాతీత ప్ర - భావా! శివా ! ॥పాహి సదాశివ!॥2

కైలాసగిరి వాస! - కమనీయ దరహాస!
లాలిత కరుణాల - వాలా! శివా! ॥పాహి సదాశివ!॥3

తరిగొండ హరి మిత్ర! - గురుతర శిఖినేత్ర!
పరమ పవిత్ర ! మాం - పాహి శివా ! ॥పాహి సదాశివ!॥4

## 32

**విషయము : చెలికత్తెలు శ్రీకృష్ణునకు, ఆయన తరుణలకు శోభనములు పాడటం(విష్ణుపారిజాతము)**

### (శోభాన) దరువు

శోభానే! శోభనమే! ॥పల్లవి॥

ప్రాభవయుతునకు - భావజ గురునకు ॥శోభానే!॥ ఉపపల్లవి॥

శ్రీరమణీ హృదయేశునకూ -
చిన్మయునకు జగదీశునకూ
నారాయణునకు నంద తనయునకు -
ధీరున కబ్ధి గభీరునకూ ॥శోభానే!॥1

అంతర్లక్ష్య విహారునకూ -
అరిషడ్వర్గ విదూరునకూ
అంతర్యామికి అఖల స్వామికి -
చింతామణికిని శ్రీహరికీ ॥శోభానే!॥2

జాత, జరా, మృతి రహితునకూ -
సన్మోక్షశ్రీ సహితునకూ
ఖ్యాతిగ శ్రీవేంకటగిరిపతికిని -
శ్రీతరిగొండ నృసింహునకూ ॥శోభానే!॥ 3

## 33

**విషయము : శ్రీకృష్ణునకు, ఆయన పత్నులకు చెలులు పాడిన నలుగుపాట (విష్ణుపారిజాతము)**

### నలుగు పాట

శ్రీమదన గోపాల! - శృంగారరస లీల !
హేమ భాస్వర చేల! - ఇందిరాలోలా ! ॥శ్రీమదన॥ 1

వనద సన్నిభ గాత్ర! - వసుదేవ వరపుత్ర!
ఘన సత్య చారిత్ర! - కరకంఠ మిత్రా ! ॥శ్రీమదన॥ 2

గురు శేషాద్రి నివేశ! - ఘోరారిమదనాశ!
తరుణేందు సంకాశ! - తరిగొండాధీశా ! ॥శ్రీమదన॥ 3

## 34

**విషయము : పత్నీ సమేతుడై యున్న శ్రీకృష్ణుని చెలులు ఆనందంతో కొనియాడిన సువ్వాల పాట. "లాలీ!" - అని ఉండటంవల్ల ఇది 'లాలిపాట'గా కూడ పరిగణింపదగివుంది. (విష్ణుపారిజాతము)**

### సువ్వాల పాట

సువ్వి సువ్వి యదుకులేశ! - సువ్వి శేషాచలేశ !
సువ్వి సువ్వి జగదధీశ ! - సువ్వి లాలీ! ॥సువ్వి॥ 1

పరమధర్మానుగుణ్య ! – భక్త సంతతి శరణ్య!
సురుచిరామరాగ్రగణ్య ! – సువ్వి లాలీ ! ॥సువ్వి॥ 2

విమల పరమపద విహార! – వేద వేదాంత సార !
సుమహితాంబునిధిగభీర ! – సువ్వి లాలీ! ॥సువ్వి॥ 3

శ్రీతరిగొండ నారసింహ!– శోషితాంహ! చి
జ్జ్యోతి రూప! శ్రీప! భూప! – సువ్వి లాలీ! ॥సువ్వి॥ 4

## 35

**విషయము : పత్నీ సహితుడై యున్న శ్రీకృష్ణునకు చెలులు ధవళములు పాడటం (విష్ణుపారిజాతము)**

### ధవళము

జయ జయ నిగమాంత సారా! – జయ జయ కనకాద్రి ధీరా !
॥పల్లవి॥

జయజయ జలధి గంభీరా! – జయ జయ భక్తమందారా!
॥జయజయ॥ 1

జయ జయ దానవ భీమా! – జయ జయ సుజనాభిరామా!
॥జయజయ॥ 2

జయ జయ పరిపూర్ణ కామా! – జయ జయ దైవ లలామా!
॥జయ జయ॥ 3

జయ జయ జలద సంకాశా! – జయ జయ వరచిదాకాశా !
॥జయ జయ॥ 4

జయ జయ శేషాచలేశా! – జయ జయ తరిగొండాధీశా!
॥జయ జయ॥ 5

## 36

**విషయము : పత్నీ సమేతుడైయున్న శ్రీకృష్ణునకు యువతులు (నాటకాంతంలో) మంగళ హారతి యిస్తూ ఆనందంతో ఆలాపించిన గేయం (విష్ణుపారిజాతము)**

### మంగళం

మంగళం! మంగళం! ॥పల్లవి॥

కృష్ణా! కృష్ణా! మంగళం! మంగళం! ॥ఉపపల్లవి॥

లాలిత కృపాలవాల! వినత సూరిజాల!
కనకరుచిర చేలా!
శ్రీలోల! మోహన లీల! సత్త్వవిశాల!
నీలవర్ణ! బాల గోపాలా! ॥మంగళం!॥ 1

మందరోద్ధారా! సనందనాది యోగిబృంద
సన్నుత గోవిందా! సం
క్రందనార్చితా! నందతనయ! ముచికుందవరద!
శ్రీముకుంద! సానందా! ॥మంగళం!॥ 2

కుండలిగిరి వాసా! కుండల కర్ణ! వే
దండ శుండ దోర్దండా ! బ్ర
హ్మాండ రూపా! తరిగొండ వాస! దనుజ
భండన తిమిర ప్రచండ మార్తాండా! ॥మంగళమ్!॥ 3

## 37

### విషయము : బృందావనంలో శరద్రాత్రియందు శ్రీకృష్ణుడు కావించిన వేణునాదంయొక్క వర్ణన (బాలకృష్ణ నాటకము)

### దరువు - ఆది తాళం

వింత వింత లాయె శౌరి - వేణు నాదమూ ॥పల్లవి॥

నిరత, మంతరాత్మ నరసే వారి - కైన నాదమూ ॥వింతవింత॥
॥ఉపపల్లవి॥

త్రిజగన్మోహనమైనట్టి - దివ్య నాదమూ
మేటి, భుజగకాంత తుదను మ్రోసే - బోధ నాదమూ॥వింత॥1

సుజనులాకు ముక్తి పథము - జూపే నాదమూ
మునులు, విజన దేశమందు నిలిచి - విన్న నాదమూ॥వింత॥2

చెనఁటి దురితములకు భయముఁ - జేసే నాదమూ
మదిలోఁ, బనుపడిన విక్షేపములను - బాపే నాదమూ॥వింత॥3

వీనులాకు చల్లనైన - విమల నాదమూ
సకల, గాన విద్య కెల్లఁ దల - కట్టు నాదమూ ॥వింత॥4

పరమయోగు లానందించే - ప్రణవ నాదమూ
శ్రీ, తరిగొండ నరహరినిఁ జూపే - తారక నాదమూ ॥వింత॥5

## 38

### విషయము : బృందావనం చేరిన గోపికలు శ్రీకృష్ణుని స్తుతించటం (బాలకృష్ణ నాటకము)

**దరువు - త్రిపుట తాళం**

శరణు శరణూ - శరణు శరణూ

శరణు శరణూ - శరణు శరణూ ॥పల్లవి॥

శరణు శరణు త్రిలోకనాయక!
శరణు పురహర సాయకా!
శరణు ముక్తిఫల ప్రదాయక!
శరణు భక్త సహాయకా! ॥శరణు శరణూ॥ 1

శరణు యోగి మనోబ్జ బంభర!
శరణు శరణు చిదంబరా!
శరణు ప్రవిమల కాంచనాంబర!
శరణు మాయాడంబరా! ॥శరణు శరణూ॥ 2

శరణు శ్రీతరిగొండ మందిర!
శరణు *వత్స ధృతేందిరా!
శరణు మోహన! దివ్య సుందర!
శరణు దరనిభ కంధరా! ॥శరణు శరణూ॥ 3

---

* 'వత్సధృత+ఇందిరా!' - శ్రీవత్సమున ధరింపబడిన ఇందిరాదేవి కలవాడా! - అని యర్థము.

## 39

విషయము : బృందావనమున గోపికలు శ్రీకృష్ణుని స్తుతించటం

(బాలకృష్ణనాటకము)

### దరువు - ఆది తాళం

బాల గోపాలా! హరే!
మాం రక్ష శౌరే! బాల గోపాలా! హరే! ॥పల్లవి॥

బాల గోపాలా! పావన శీలా!
బాల గోపాలా! హరే! ॥బాల గోపాలా!॥ ॥ఉపపల్లవి॥

నంద కుమారా! నగవర ధీరా!
సుందరాకారా! హరే! మాం రక్ష శౌరే! ॥బాల॥ 1

మరళీ విలోలా! మోహన లీలా!
దురిత విఘాలా! హరే! మాం రక్ష శౌరే! ॥బాల॥ 2

తరిగొండాధీశా! తరణి సంకాశా!
వర చిదాకాశా! హరే! మాం రక్ష శౌరే! ॥బాల॥ 3

## 40

విషయము : బృందావనంలో శ్రీకృష్ణుడు కావించిన నృ,త్యవర్ణన

((బాలకృష్ణనాటకము)

### దరువు - ఆది తాళం

ఆడెనే! కృష్ణుఁ డాడెనే! ॥పల్లవి॥
ఆడెనే! శ్రీకృష్ణుఁ-డమరులు నభమున
జూడఁగ, ధరణిలో - శోభిత లీలల ॥ఆడెనే! కృష్ణుఁ డాడెనే!॥
॥ఉపపల్లవి॥

జోడుగ సుదతులు పాడఁగ, ముదమునఁ
జూడఁగ, శరణని - వేడఁగ, నవ్వుచు ॥ఆడెనే! కృష్ణు॥ 1

మొలనూలి గజ్జెలు, - మువ్వలు, అందెలు
గలిబిలిగా ఘలు - ఘల్లన వేడుక ॥ఆడెనే! కృష్ణు॥ 2

చెలులకు మోహము - చెలఁగగఁ బలుమఱుఁ
గులుకుచు శ్రీతరి - గొండ పురాధిపుఁ ॥డాడెనే! కృష్ణు॥ 3

## 41

### విషయము : బృందావనంలో గోపికలకు ప్రసన్నుడయిన శ్రీకృష్ణుని స్వరూపం (బాలకృష్ణనాటకం)

### దరువు, సురట రాగం - ఆది తాళం

వచ్చెనూ కృష్ణుఁడు - వగమీఱఁగా ॥పల్లవి॥
హెచ్చనీ కామిను - లెదురుగాఁ జనఁగా
వచ్చెనూ కృష్ణుఁడు వగమీఱఁగా ॥ఉపపల్లవి॥

ఘనతరముగఁ జిఱు - గజ్జెలు, మువ్వలు,
అనువుగ మొఱసెడి - అందెలునూ
మొనసి పదములను - మ్రోయ నటింపుచు
ననఁబోఁణులఁ గని - నవ్వుచునూ ॥వచ్చెనూ॥ 1

పరిశోభితముగ - బంగరు శాలువ
సరవిని చుంగులు - జాఱఁగనూ
ఉరమున సరిపెణ- లొరయఁగఁ, బదకము
లరుదుగ నిగనిగ - మెఱయఁగనూ ॥వచ్చెనూ॥ 2

అలరిన శిఖిపిం - ఛావృత మకుటము
ధళధళ శిరమున - వెలుఁగఁగనూ
కులుకుచు శ్రీతరి - గొండకునూ ॥వచ్చెనూ॥ 3

## 42

విషయము : బృందావనంలో రాధ శ్రీకృష్ణుణ్ణి పిలవటం
(బాలకృష్ణ నాటకము)

### దరువు - ఆది తాళం

రారా! గోపాల స్వామి! రారా! ॥పల్లవి॥

ఊరకే వగలేలఁ జేసేవురా? ॥రారా!॥ ॥ఉపపల్లవి॥

చాలాగ నీ మీఁద నెంతో - జాలిమాలాయె, తాళఁ
జాలా నీవేళ, మాయ - లేలఁ జేసే? విందు ॥రారా!॥ 1

మారుఁడు నిర్దయను సారె - సారెకు బాణ వర్ష
ధారలు గురిసి, నాతో-పోరాటం మునకు వచ్చె ॥రారా!॥ 2

శ్రీకర తారిగొండ నార - సింహా! ఇన్నాళ్లు నీదు
రాక గోరుచున్నా, ప్రేమ - లేకయున్నా వీ వేళ ॥రారా!॥ 3

## 43

విషయము : రాధాదేవి దృష్టిదోష నివారణార్థమై శ్రీకృష్ణునకు నాటకాంతంలో మంగళ హారతి యివ్వటం (బాలకృష్ణనాటకం)

### మంగళ హారతి దరువు - అట తాళం

మాధవాయ జయ - మంగళమ్ ॥పల్లవి॥

విధినుత చరణాయ - వేదోద్ధరణాయ
మధుదైత్య హరణాయ - మంగళమ్ ॥శ్రీ॥మాధవాయ॥ 1

బుధజన మిత్రాయ - భూమి కళత్రాయ
మధుర భాషణాయ - మంగళమ్ ॥శ్రీ॥మాధవాయ॥ 2

మందరోద్ధరణాయ - మంగళమ్, విమల
కుందాళి రదనాయ - గురుతర తరిగొండ
మందిరాయ శుభ - మంగళమ్ ॥ శ్రీ॥మాధవాయ॥ 3

## 44

విషయము : ఇష్టదేవతా ప్రార్థన (శివ నాటకము)

### దరువు, నాట రాగం - జంపె తాళం

జయ చిన్మయాకార! - జయ దేవ పరివార!
జయ ఫల్గుణోద్ధార! - జయ దురిత దూరా!
జయ కలుష సంహార! - జయ భావజ విదార!
జయ జాహ్నవీదార! - జయ సుగుణసారా! ॥జయజయా॥ 1

జయ దీన మందార! - జయ సింధు గంభీర!
జయ మేరు సమ ధీర! - జయ భుజగ హారా!

జయ రత్న కేయూర! – జయ సత్కృపాపూర!
జయ నిగమ సంచార! – జగదేక వీరా! ॥జయ జయా॥ 2

జయ సత్య చారిత్ర! – జయ సన్ముని స్తోత్ర!
జయ మురాంతక మిత్ర! – జయ దివ్య గాత్రా!
జయ సంతత పవిత్ర! – జయ శక్రనుతిపాత్ర!
జయ నిటలతట నేత్ర! – జయ పంచవక్త్రా! ॥జయ జయా॥ 3

## 45

విషయము : ఇష్టదేవతా ప్రార్థన (శివ నాటకము)

### దరువు . . . .రాగం - ఆది తాళం

నాగాభరణ! తే – నమో నమో
భవ! నాగ మృగేంద్ర! తే – నమో నమో ॥నాగా॥ ॥పల్లవి॥

నిగమ పాలనా! – నిత్య! నిరంజన!
అగణిత వైభవ! – అఖిలాత్మా!
జగదీశ్వర! సుర – సన్నుత విగ్రహా!
నగజాధిప! తే – నమో నమో ॥నాగా॥ 1

పురహర! భవహర! – భూసుర పాలన!
పరమేశ్వర! భవ! – ఫాలాక్షా!
దరధర వందిత – చరణ సరోరుహా!
నర సంరక్ష! తే – నమో నమో ॥నాగా॥ 2

గరళ కంధరా! – గంగాధర! హర!
స్మర సంహర! శ్రీ – మహితాత్మా!

గురువర! శ్రీ తరి - గొండ పురాధిప
నరహరి సఖ! తే - నమో నమో ॥నాగా॥ 3

## 46

*విషయము : గణనాయక స్తుతి (శివ నాటకము)*

**దరువు . . . .రాగం - ఆది తాళం**

దేహి దేహి గణాధిపా! ముక్తిం - దేహి దేహి గణాధిపా! ॥దేహి॥
పరమపవిత్రా! గణాధిపా! శం - కర వరపుత్రా! గణాధిపా! ॥దేహి॥ 1
సారాచారా! గణాధిపా! - గిరిజాత కుమారా! గణాధిపా!॥దేహి॥ 2
మూషక వాహన! గణాధిపా! స - న్ముని నికరావన! గణాధిపా! ॥దేహి॥ 3
చామర కర్ణా! గణాధిపో! - తరిగొండ విహారా! గణాధిపా! ॥దేహి॥ 4
గండక దూరా! గణాధిపా! - ప్రజ్ఞా పరిపూర్ణా! గణాధిపా! ॥దేహి॥ 5

## 47

*విషయము : ప్రమథుల శివ స్తుతి (పార్వతీదేవి సౌధంలో - శివ నాటకము)*

**దరువు**

సదాశివా! పాహి - సదా శివా! పాహి
సదాశివా! పాహి - సదాశివా! ॥పల్లవి॥

అక్షీణ కరుణా క - టాక్ష వీక్షణ! సర్వ
రక్షణ! నిటల త - టాక్షా! శివా! ॥సదా॥ 1

శృంగాటకమునందు - శృంగారలలన పొందు
అంగీకరించిన శుబాం - గా! శివా! ॥సదా॥ 2

ఎన్నఁగ భక్తుల - మన్నించి ప్రోచేటి
కన్న తండ్రివి నీ - వన్నా! శివా! ॥సదా॥3

ఆపద లన్నియుఁ - బాపుము; నా మీఁద
కోపమేలర? చి - ద్రూపా! శివా! ॥సదా॥4

సారేశు మిము వే - సారక వేడిన
కోరిక దీర్చ వ - దేరా? శివా! ॥సదా॥5

కుండలి తుద దివ్య - పుండరీకములో, తరి
గొండహరినిఁ గన్న పరమా - ఖండా! శివా! ॥సదా॥6

## 48

*విషయము : ఎఱుకత(లక్ష్మి) వర్ణన (శివ నాటకము)*

## దరువు, ఎఱుకల కాంభోజి రాగం

వచ్చె నెఱుకతా ॥పల్లవి॥
వచ్చె నెఱుకో! యెఱుక! యనుచును -
వాడ వాడల వెంటనూ
హెచ్చుగా మందాకినికిఁ దా - నెఱుక చెప్పెద ననుచునూ ॥వచ్చె
నెఱుకతా॥ ఉపపల్లవి॥

ఘలుఘలున పాదముల బంగరు - గజ్జె, లందెలు మ్రోయఁగా
చెలువు మీఱిన పసిఁడి చెఱఁగుల - చీర కుచ్చులు జారఁగా
అలరఁ జందురు కావి ఱవికయు - అందముగ రాణించఁగా
ధళ ధళన నవరత్న భూషణ - ములును వగ వగ మించఁగా
॥వచ్చె నెఱుకతా॥ 1

కలికి వాల్గన్నులను కాటుక - కమ్మి, సోగలు మెఱయcగా
సులలితముగా బొమల సందున - సొగసు నామము వెలుcగcగా
పొలుపు మీఱిన నుదుట పచ్చని - బొట్టు నిగనిగలీనcగా
విలసితముగా గొప్ప కొప్పున - విరుల సరములు కదలcగా
॥వచ్చె నెఱుకతా॥ 2

ప్రమదమునc దగ విడెము సేయుచు - బాలకుని ముద్దాడుచూ
అమర శిరమున నుండు బుట్టిని - అందముగc జేపట్టుచూ
క్రమముగాc దన కెదురు వచ్చిన - కమలనేత్రలc జూచుచూ
"రమణులారా! ఎఱుక చెప్పెద - రండు! రం"దని పిలుచుచూ
॥వచ్చె నెఱుకతా॥ 3

## 49

### విషయము : ఎఱుకత చేసిన దేవతా ప్రార్థనము *(శివ నాటకము)*

### దరువు

శ్రీగణనాథ! - శ్రీశైల ప్రఖ్యాత!
భోగి శయాన! - భుజగేంద్ర భూషణ! ॥పల్లవి॥
జలజభవ! రారా! - చల్లని వాక్కీరా!

మాధవ! రారా! మంచి వాక్కీరా!
కమలాప్త! రారా! - ఘట్టి వాక్కీరా! ॥ఉపపల్లవి॥

సలలిత యేకాంబ్ర - సామీ! వాక్కీరా!
నలువందcగా జంబు -నాథ! వోసామీ! వాక్కీరా! 1

అరుణాచలేశా! మే - లైనా వాక్కీరా! మేలైనా వాక్కీరా!
కమలాప్త! రారా! ఇరవంద - కాళహస్తీశ! రారా!॥కమ్మని వాక్కీరా!॥ 2

మన్నారు కృష్ణ! నీవు - మంచి వాక్కీరా!
నీవు మంచివాక్కీరా
పన్నగగిరి రాయ! - బాగా వాక్కీరా! 3

తిలోనం చిదం బ- రయ్యా! వాక్కీరా!
అలా బాలాపల్లె - రాయా! అందమైన వాక్కీరా! 4

చతురూడు ముళువాయి - ఘరి ఆంజనేయా!
హోషూరి ఆంజనేయా! - సతతాము రక్షించు రామేశలింగా! 5

కంచి కామాక్షమ్మ! - కరుణించవమ్మా!
అంచయానరో! రంగ - నాంచారు తల్లీ! ॥6॥

దొరకొని బెజవాడ- దుర్గ వాక్కీవే!
వో దుర్గి! వాక్కీవే !
హరిణాక్షి! కొల్లాపురె -మ్మా! వాక్కీవే! ॥7॥

## 50

**విషయము : ఎఱుకల సింగని(తరిగొండనరసింహస్వామి) వేషము (శివనాటకము)**

### దరువు

శింగఁడొచ్చెనూ యెఱుకల - శింగఁడొచ్చెనూ ॥పల్లవి॥

శింగి! శింగి! యనుకుంట - శికిలి నవ్వు నవ్వుకుంట
శెంగనా గంతులు వేసుకుంటనూ
॥శింగఁడొచ్చెనూ; యెఱుకల - శింగఁడొచ్చెనూ॥ 1

పుల్ల మీసముఁ దీడుకుంట - లొళ్ళి సుద్దులు జెప్పుకుంట
జొల్లు గార్చుకుంట గిలుక- లల్లుకుంటనూ
॥శింగఁడొచ్చెనూ, యెఋకల - శింగఁ డొచ్చెనూ ॥2

గొంగ డొకటి మొలను జుట్టి - కొడవలి పిడెను చాతఁబట్టి
కొంగ యీకలు తలకుఁ జుట్టి - కొంకుకుంటనూ
॥శింగఁడొచ్చెనూ, యెఋకల - శింగఁడొచ్చెనూ॥ 3

## 51

### విషయము : సింగి ఆకృతి (సింగని మాటల్లో - శివ నాటకము)

### దరువు

సింగినిఁ గానరుగా! పరతత్త్వా ముక్తీ - సింగినిఁ గానరుగా!
॥పల్లవి॥

గలగలమంటా కూశేదేమో - కాళ్ల నిండా కట్టుక వచ్చే ॥సింగినిఁ గానరుగా!॥ 1

మినమినమని మెఱశేదేమో - మెడనిండ వేసుక వచ్చే ॥సింగినిఁ గానరుగా!॥ 2

సుట్టాకుదుర్ల వంటివి - పట్టుగ శేతుల పెట్టుక వచ్చా ॥సింగినిఁ గానరుగా!॥ 3

బల్లివలె వుండేదేమో - పాపటలో తగిలించుక వచ్చా ॥ సింగినిఁ గానరుగా!॥ 4

బుట్టి నెత్తినఁ బెట్టుకోని - బురకని సంకన బెట్టుక వచ్చా ॥ సింగినిఁ గానరుగా!॥ 5

## 52

### విషయము : సింగీ, సింగళ్ల సంభాషణ (శివ నాటకము)

### దరువు

సింగి:- అద! యెన్నడా? యింగె - వాడా! శింగా!
గుడిశె విడిచి యాల వస్తివి? - వెఱ్ఱి శింగా!॥ 1

సింగడు:- గుడిశాలోకి యలక వచ్చె - కలికి శింగీ! నేను
ఝడిశీ నీతో జెప్పవస్తీ - జాణ శింగీ! 2

సింగి:- మంచి బంటుకాఁడవోయి! - మాయ శింగా!యలకను
పొంచి నేను వేసేఁగాని, - పోరా! శింగా! 3

సింగడు:- నేఁడు నిన్ను విడిచి పోనే! - నెలఁత శింగీ! యలకల
దాడికి నే తాళ లేనే! - తరుణి! శింగీ! 4

సింగి:- గాడిద తా నెందుఁబోయెనో? - గదర? శింగా! అయిదు
దూడ లెందు విడిచి పోయెనో? - సూదు శింగా! 5

సింగడు:- గాడిద మెడకు తాడు గట్టి - కలికి శింగీ!
దూడ లైదు కూడఁగట్టి- వచ్చినానె! శింగి!శింగీ! 6

సింగి:- వేయి సాపల గుడిశ - వెలలేని గుడిశా, యే
మాయెనో గదరా! - మాయదారి శింగా!॥ 7

సింగడు:- ఆ గుడిశలో కావ - లైదార్గున్నారు
బాగైన వాకిట - ఫణి వుందే శింగీ!॥ 8

## 53

**విషయము : చెలికత్తెలు గంగా, గౌరీ సమేతుడైయున్న శివునకు (నాటకం చివర) శుభం కలగాలని పాడిన పాట (శివ నాటకము)**

### శోభనమే! - పాట

శోభనమే! శోభనమే! నిత్య శోభనమే! ॥శోభనమే!॥పల్లవి॥

గిరి కార్ముక మొనరించీ – ఉరగము నారిగ బిగియించీ
పరcగ శ్రీహరి యను – బాణముc దొడిగియు
పురములు గెలిచిన – పుణ్యునకూ ॥శోభనమే!॥ 1

గిరి గర్భంబున ఉదయించీ – హరునిc బెండ్లాడి, మోదము మించీ
సురలను బ్రోచీ – అసురుల గెలిచిన
పరమ పతివ్రత – పార్వతికీ ॥శోభనమే!॥ 2

తరిగొండహరి పాదమునc బుట్టీ – తనర మహేశునిc జేపట్టీ
గరిమను లోక లో–కములు రక్షించిన
సరసిజలోచన – జాహ్నవికీ ॥శోభనమే!॥ 3

## 54

**విషయము : నాటకాంతంలో చెలులు పాడిన మంగళహారతి గేయం (శివ నాటకము)**

### మంగళ హారతి పాట

శైలజాత నాయకాయ – జయ మంగళం
త్రిశూల శశాంక ధరాయ – శుభ మంగళం ॥పల్లవి॥

కరిరాజ చర్మాంబరాయ – కామిత ఫలప్రదాయ
సరసిజభవ సన్నుతాయ – జయ మంగళం ॥శైల॥ 1

ఉరగరాజ భూషణాయ – ఉర్వీజన పోషణాయ
సుర, మౌని సంరక్షణాయ – శుభమంగళం ॥శైల॥2

ఇందుకళాధరాయ స – నందనాది మౌని భక్త
సందేహ నివారణాయ – జయ మంగళం ॥శైల॥3

గరళ కంధరాయ శ్రీ – గంగాధరాయ భవహరాయ
సరస సత్య భాషణాయ – జయ మంగళం ॥శైల॥4

తరిగొండ శౌరి మిత్రాయ – వర కైలాసాధీశ్వరాయ
సుర మౌని సంసేవితాయ – శుభ మంగళమ్ ॥శైల॥5

## 55

విషయము : పుష్పగిరి శంకరాచార్యుల స్తుతి (ఆశు రచన)

### భానుస్వరం రాగం - ఆది తాళం

శంకరాచార్య గురుని – సన్నుతింపరే ! ॥పల్లవి॥

నిష్కళంక పరమయోగ – మభ్యసింపరే! ॥పల్లవి॥

స్థూల, సూక్ష్మ, కారణముల – మూల మరయరే!
లలిత నీల తోయదమున – నిలిచి మెఱయరే! ॥శంక॥1

మూఁడు రెండ్లు దాఁటి పైన – మేడఁ జేరరే!
పోఁడిమిగను ముక్తికాంత – పోఁడు మరయరే! ॥శంక॥2

చక్కఁగా త్రివేణి నడుమ – జలక మాడరే!
చొక్కముగను వెలుఁగుచున్న – చుక్కఁ గాంచరే!॥ ॥శంక॥3

పన్నుగా శ్రీ తరిగొండ – పతినిఁ గాంచరే!
పరము నెన్ను కొనుచు బ్రహ్మ – పదముఁ జేరరే! ॥శంక॥4

## 56

విషయము : అలమేల్మంగను ప్రార్థించటం (ఆశు రచన)

అమ్మా! నే నిందుండుదునటవే?

శ్రీఅలమేల్మంగ! న - న్నాదరించేవటవే? ॥పల్లవి॥

అదియేమో కాని, నీ విభుఁడు నిన్నడిగి

నన్నిందుండు-మని చెప్పినాఁడూ

సదయ దృష్టిని నన్ను చూడూ

సద్గతిఁ గోరుచు నే నిందుండే నిపుడూ ॥అమ్మా!॥ 1

ఏ దేశములు తిరుగలేనూ, ఖండ

వాదులతో పెక్కు వాదించలేనూ

మేదినీంద్రుల పొగడలేనూ; ధనము

మెండుగాఁ గూర్చి దానము చేయలేనూ ॥అమ్మా!॥ 2

తనువూ నే నలయించలేనూ; కష్టముల

కోర్వఁజాలా; నే నేమి చేయుదునూ?

జన సంఘమున నిలువలేనూ;ఈ

స్థలమున మీ మహిమ సలుపుచుండెదనూ ॥అమ్మా!॥ 3

తరిగొండ నారసింహుఁడయినా శేషాచ

లేంద్రుని దాపుఁ జేరుదునా?

కరుణించి సెలవిమ్మా! చాలా మీ

పరమపదంబుల భావించుదానా ॥అమ్మా!॥ 4

## 57

విషయము : త్రవ్వించిన బావిలో నీటియూటలు ఏర్పడటకై గంగను ప్రార్థించటం (ఆశు రచన)

### మోహన రాగం - త్రిపుట చాపు తాళం

ఓ తల్లి! గంగాభవానీ! రావే!
ఖ్యాతిగ నిచటికి కపటము మాని ॥ఓ తల్లి!॥ ॥పల్లవి॥

హరిపాదమునఁ బుట్టినావు, పుర
హరుని జటాజూటమున నిలిచినావు
పరమ పవిత్ర మైనావు, మా
పాలిట వెలసి పూజలు గైకొన్నావు ॥ఓ తల్లి!॥ 1

హరి కర్పితముగ శ్రీతులసీవన
మలనాఁ దర్థితో నిన్నుఁ గావింప వెలసి
తరుణిది పెంచను మెఱసి యున్న
నర లేక రావె! శేషాద్రిలో వెలసి ॥ఓతల్లి!॥ 2

వాసిగ నిను చాల నమ్మి, చిన్న
వాండ్ల కాదరువుగ నున్న సొమ్మమ్మి
చేసితి, నిను పని నమ్మి చేయ
నిరవుగ నిచటికి బిరబిర రమ్మి! ॥ఓతల్లి!॥ 3

తరిగొండ నరసింహుఁడైనా శేష
గిరివాసు నేవేళ కీర్తింపు జ్ఞాన!
కరుణ నాపై నుంచు శాన,
మమ్ము, కడతేర్చు భారము కల్గిన దాన ॥ఓ తల్లి!॥ 4

## 58

విషయము : బ్రహ్మవ్రాత ప్రభావము (ఆశు రచన)

నుదుట వ్రాసిన వ్రాలు - నూతేండకును తప్ప
దిది యేటి చింత నీకూ? ॥పల్లవి॥

అరసి కర్మంబు లది - యజుఁడు వ్రాసిన వ్రాలు
నరులు తప్పింపఁగలరా?
సురగురుని సతిని ముసు - సోముఁడంటిన తరిని
సురగురుఁడు, సురవిభుఁడు - సుర లడ్డమైనారే?
॥నుదుట వ్రాసిన వ్రాలు॥ 1

ఆ రావణుఁడు సీత - నలరి గొంపోవఁగా, ము
న్నా రాముఁ డతనిఁ ద్రుంచీ
కోరి ధరణిజను గై - కొనియె సుర లెన్నఁగా
నీరజేక్షణ లోక -నిందఁ జెందెను గనుక ॥నుదుట వ్రాసిన వ్రాలు॥ 2

వరుసగా నా చిన్న - వాండ్ల నే రక్షింప
వలె ననెడి యభిమానమూ
మఱచి శేషాద్రిపతి - మానకర్తని తెలిసి,
తరిగొండ హరి నెఱిఁగి - పరమొందవే! మనస!
॥నుదుట వ్రాసిన వ్రాలు॥ 3

## 59

విషయము : భగవంతుడే సర్వకర్త (ఆశు రచన)

ఎవ్వారి కెవరు గల? - రీశ్వరుఁడె గానీ ॥పల్లవి॥
క్రొవ్వి నే కర్త నను- కొన నేల? పూనీ
॥ఎవ్వారి కెవరు॥ ॥ఉపపల్లవి॥

విరివి కురుపతి వలువ - విడిపించు సమయమున
హరి ద్రౌపదికి నక్ష - యాంబరము లొసఁగీ
యరసి మానముఁ గాచె - నా సభా మధ్యమున
పర భయంకరులైన - పతు లడ్డమైరే? ॥ఎవ్వారి కెవరు॥ 1

బలభేది మాయ కగ - పడి యహల్యాదేవి
శిలయై యడవి నున్న , - శ్రీరాముఁ డపుడు
తెలిసి తా రాతి నాఁ -తినిఁ జేసి రక్షించె, నల పతియు,
సుతుఁడుండి యటు బ్రోచినారే? ॥ఎవ్వారి కెవరు॥ 2

నాపాలి తరిగొండ - నారసింహస్వామి
శ్రీపన్న గాద్రి వర - శిఖరమందుండీ
చేపట్టి దయచేసి - చిన్నవాండ్లకు, నీకు
ప్రాపు, దాపగుచు సం - రక్షించె మనసా!
॥ఎవ్వారి కెవరు గల? రీశ్వరుడె గానీ॥ 3

## 60

విషయము : వెంగమాంబ తుంబురుకోనకు వెళ్లే సందర్భంలో శ్రీస్వామివారిని ప్రార్థించటం (ఆశు కవిత)

### శ్రీరాగం

శ్రీనివాస స్వామి! - సెలవీయవయ్యా! ॥పల్లవి॥

నానా ప్రకారముల - నను@ గావవయ్యా! ॥ఉపపల్లవి॥

తెలఁగొప్ప నే వ్రతం - త్రించినానని మదిని
పరమాత్మ! నీవు కో - పము నుంచవలదూ
సురవినుతమైన తుం -బురు కోన వీక్షించి
మఱల వచ్చెద ననెడి - మతి నాకుఁ గలదూ ॥శ్రీనివాసస్వామి!॥ 1

అలఘు భాగవతము స - మగ్రంబుగాఁ జదువ
వలెఁ గనుక, శీఘ్రమే - వత్తు నిచ్చటికీ
నెలవుగా నాతోడు -నీడవై నా వెంట
వలనుగా నీవు రా - వలయు నచ్చటికీ ॥శ్రీనివాస స్వామి!॥ 2

నీవు సంకల్పించి - నిలుపుచుండిన చోట
నే వసించుట నాకు - నిష్కరుష గనుకా
దేవ! నా సంకల్ప - మే విధంబున సాగు
గోవింద! కృష్ణ! తరి - గొండ నరసింహా!
॥శ్రీనివాసస్వామి! - సెలవీయవయ్యా!
నానా ప్రకారముల - నను@ గావవయ్యా!॥ 3

## 61

### విషయము : తుంబురు కోనను ప్రార్థించటం (ఆశు రచన)

**శంకరాభరణం**

వేంకటపతి తుంబురుకోనా! నిను
వేడెదనే! తుంబురుకోనా! ||పల్లవి||

పొంకముగా తుంబురుకోనా!
పోషింపవె! తుంబురుకోనా! ||ఉపపల్లవి||

శ్రీవిలసిత తుంబురుకోనా! నిను
సేవించితి తుంబురుకోనా!
పావనమగు తుంబురుకోనా! నా
పాప మణఁచు తుంబురుకోనా! శ్రీ||వేకటపతి|| 1

పొలుపొందిన తుంబురుకోనా! నిను
పొగడఁదరమె? తుంబురుకోనా!
విలసితమగు తుంబురుకోనా! నిను
విడువలేనె! తుంబురుకోనా! శ్రీ||వేకటపతి|| 2

అన్ని విడిచి తుంబురుకోనా!
నిన్నాశ్రయింతు తుంబురుకోనా!
ఉన్నతమగు తుంబురుకోనా!
. . . . . రు . . . . రి . . . . తుంబురుకోనా! శ్రీ||వేంకటపతి|| 3

సుమఫలయుత తుంబురుకోనా! దయఁ
జూడవె! నను తుంబురుకోనా!
శ్రమ మొప్పఁగ తుంబురుకోనా! తిరు
గా వచ్చెద తుంబురుకోనా! శ్రీ||వేంకటపతి|| 4

## 62

విషయము : తుంబురు తీర్థమును ప్రార్థించటం (ఆశుకవిత)

తీర్థమా! తుంబురుకోన తీర్థమా! ॥పల్లవి॥

ప్రార్థించి ఫాల్గున - పౌర్ణమినాడు నే
సార్థకముగ నీలో - స్నానము చేసితి
॥తీర్థమా! తుంబురుకోన తీర్థమా!॥ ॥ఉపపల్లవి॥

పాపమూ, మించిన మన
స్తాపమూ నివారించి
ప్రాపు దాపై నన్ను - కాపాడవే! దివ్య
గగన గామిని పుణ్యతీర్థమా!
॥తీర్థమా! తుంబురు కోన తీర్థమా॥ 1

వెలయనూ, బ్రహ్మమునందు గలయనూ
పొలుపొందఁగాను తుం - బురుఁడు, నారదుడును, చ
(రించి స్నాన)ము లిందుఁ జేసి - రటవే? పుణ్య తీర్థమా।
॥తీర్థమా! తుంబురుకోన తీర్థమా!॥ 2

సురలును, తక్కిన మౌనివరులును
నిరుపమ భక్తితో - నిన్నాశ్రయించి, యిం
దరుదుగ విహరింతు - రటవే? పుణ్య తీర్థమా!
॥తీర్థమా! తుంబురుకోన తీర్థమా!॥ 3

వచ్చితి నే నీ మఱుఁగుఁ జొచ్చితిని
ఇచ్చట నిలుచుట - కిచ్ఛయింతిని, నా

ముచ్చటఁ దీర్చి, స-న్మోక్ష మియ్యవే ! పుణ్య తీర్థమా!
॥తీర్థమా! తుంబురుకోన తీర్థమా!॥ 4

పరమునూ కోరితి, నన్య వరమునూ
పరఁగ నే నొల్ల, శ్రీ - తరిగొండ హరియైన
ఉరగాద్రిపతికి న - న్నొప్పగించవె! పుణ్య తీర్థమా!
॥తీర్థమా! తుంబురుకోన తీర్థమా!॥ 5

## 63

**విషయము : తుంబురుకోననుండి తిరుమలకు మరలివచ్చునప్పుడు చెప్పిన గేయం (ఆశు కవిత)**

*శంకరా భరణం*

కరుణా మూర్తులు రామలక్ష్మణులు - కాపాడిరి నన్నూ ॥పల్లవి॥

గురుతర తుంబురుకోననుండి నే -
మరలి వచ్చునెడ మార్గములో నతి ॥కరుణా మూర్తులు॥ ఉపపల్లవి॥

సురుచిర కనకాంబరములు, దివ్యా -
భరణము లొప్పఁగనూ
శర, చాపంబులు సవరింపుచు నా -
కిఱుగడలను, ముందర నడచుచు నతి ॥కరుణా మూర్తులు॥ 1

కన్నులలోను ప్రసన్న భావమును -
మిన్నగఁ జూపుచునూ
క్రన్నన చోరమ్మృగములకు మదిలో -
పన్నుగ నించుక భయపడ నియ్యక ॥కరుణా మూర్తులు॥ 2

హాటక రత్న కిరీటము లమరఁగ -
నీటు చెలంగఁగనూ
తేటగు శ్యామల దేహంబులతో-
నాటిన సత్కృప నాయెడ నుంచుచు ॥కరుణా మూర్తులు॥ 3

ధరపై నార్తత్రాణపరాయణ -
బిరుదము మఱువకనూ
వెరవకుమని తొందరపడనియ్యక -
అఱిముఱి నాకు సహాయంబగుచును ॥కరుణా మూర్తులు॥ 4

తరిగొండ నృకేసరియగు వేంకట -
గిరి నాయకు కృప పరఁగఁగనూ
శరణాగత సంరక్షణ -
మరయఁగ తమ పని యనిన విధంబున ॥కరుణా మూర్తులు॥ 5

## 64

**విషయము : శ్రీవేంకటేశ్వరుణ్ణి మోక్ష మిమ్మని ప్రార్థించటం (ఆశు కవిత)**

శ్రీవేంకటేశ! మోక్షముఁ జెందే కొఱకు - సేవలేమి జేతు? నేనూ
కావు మనుచుఁ *జొచ్చున్నెడఁ - గడ తేర్చ మీ భారమేనూ
భూవరాగ్రణు లెంతో బుద్ధిమంతులయినా - పొగడి సేవలఁ
జేయలేనూ
భావించి శ్రీదేవి, నీ వేకమై వొక్క - పనిఁ జెప్పితే చేసేనూ 1

చొచ్చి+ఉన్న+ఎడన్ - అని పదవి భాగము

అరసి మీ పనులం దేమైనఁ జేసెదనంటె - అండఱన్నిటికి నున్నారూ
హరి శరణనుచు మ్రొక్కెదనంటె బ్ర - హ్మాదు లందుకు పనిఁ
బూనినారూ
మురువొప్ప నుతులైన నేను చేసెదనంటె - మునులందుకే పుట్టినారూ
వర కవిత్వముఁ జెప్పి మెప్పించెదనంటె - వాల్మీక్యాదులు
చెప్పినారూ. 2

పనిఁ బూని నేను మీ పానుపయ్యెదనంటె - ఫణిరాజు కాచియున్నాఁడూ
ఘనముగ నే నీ వాహనమయ్యెదనంటె - ఖగనాయకుఁడు నిల్చినాఁడూ
వినుత సేనాధిపత్యముఁ జేసెదనంటె - విష్వక్సేనులు
నిల్చినారూ. 3

మొనసి పాదము లొత్తెదనంటె - భూనీళాలు ముట్ట నివ్వరు నన్నుఁ
జూడూ
అతులితముగ వర్ణించి పాడెదనంటె - ఆళువారాదులు పాడినారూ
హితవుఁ జెప్పుచు మీ చెంత నుండెదనంటె-
ఎంబెరుమానా రున్నారూ
బ్రతిమాలి దాసానుదాసి నయ్యెదనంటె - జయవిజయులు చేరనీరూ
సతతము ద్వారామై నిన్నె కాచెదనంటె - జయవిజయులు చేరనీరూ. 4

నగుచు మీ చెంతను వీణ మీటెదనంటె - నారదాదులు మీటనీరూ
నిజభక్తిగా భూషించెదనంటె - నిత్యసూరులు గలిగినారూ
జగిబిగి వీడె మిచ్చెదనంటె - ఇల పుణ్యస్త్రీ లందు కొడిగట్టినారూ
పరఁగ వింజామర విసిరేదనినా - భాగ్యవతులు కోరి చేరనీరూ. 5

తరిగొండాధిప! మిమ్ము మరగిన మనసింక - తప్పించి, యిఁక నెందుఁ బోదూ
శరణాగతత్రాణ బిరుదు గలిగితె మమ్ము- సర్వత్ర విడనాడరాదూ
పరమాత్మ! మమ్మింక విడనాడితే వేరె - ప్రాపు మాకెక్కడా లేదూ
గురు నిర్హేతుక ప్రాపంచ నిర్వాణ - ఫల మివ్వ నిఁక నెందుఁ
బోదూ॥ 6

Note: ఈ క్రింది యెనిమిది "ద్విపదార్థముల" లోని విషయము **వేదాంతము. ఇవన్నీ ఆశు రచనలే.**

## 65

## ద్విపదార్థము

**ద్విపద.** శ్రీకరంబైనట్టి - శ్రీ గురు కరుణఁ
జేకొని కర్మ సం - చిత మనుభవించి
సాకార గుణములు - సన్నుతిఁ జేయ

**గేయం** ॥ఆకాశాతీతుఁ డందురే!॥
ఆనందభావము లోకానఁ జేయుచుండుదురే!
జోకతోఁ జూపు, మన
మేకముఁ జేసి, నీలో
వాకిలిఁ దీసి, సత్య
లోకమఁ జూచి, చిత్కళ
॥ఆకాశాతీతుఁ డందురే!॥

## 66

### ద్విపదార్థము

ద్విపద. అంజనులైరి యీ - అజ్ఞానమనెడి
పెంజీకటినిఁ జిక్కి - పెనఁగుచుఁ దాను
కంజాక్షుఁడౌ గురు - కరుణోదయమునఁ

గేయం.॥గంజదళాక్షుఁ డందురే!॥
ఆ రెంటి మధ్య కంజామూలముఁ గందురే!
రంజిల్లు చున్న పాపపుంజాములాను వెడలి
నిరంజనులవలె చిరంజీవులైన ముద్దు
॥కంజదళాక్షుఁ డందురే!॥

## 67

### ద్విపదార్థము

ద్విపద. ఆదినిఁ ద్రివిధ ప్ర - సాద మొనరించి
భేద వాదంబులు భేదించి, తత్త్వ
వేదాంతనిష్ఠచే - వెలసిన బ్రహ్మ

గేయం.॥నాద వినోద మందిరే॥
సంతతము అనాది బోధను జెందిరే!
మోదమలర హంస
పాదు దెలిసి, కొండ
మీది త్రోవలొ అంతర్వేదిలోపల వేఱు
॥నాద వినోద మందిరే!॥

## 68

### ద్విపదార్థము

ద్విపద. కర్మమార్గంబునఁ - గడతేరలేక
కర్మపరిత్యాగి - కారణయోగి
మర్మజ్ఞుఁడై చిత్స - మాధిచేఁ బూర్వ

**గేయం.** ॥కర్మమూలముఁ గందురే!॥
విజ్ఞానులై నిష్కర్షభావమునఁ జెందిరే!
కర్మాకర్మముల రెంటి మర్మ మెఱిఁగి, జన్మ
కర్మ మింతాయె నని
నిర్మలమైన దేహి
॥కర్మమూలముఁ గందురే!॥

## 69

### ద్విపదార్థము

ద్విపద. సావధానముగాను - సదసద్వివేక
సేవ విచారంబుఁ - జేయుచు, మధ్య
కేవల కుంభక - క్రీడ సల్పుచును

**గేయం.** ॥జీవుని తావుఁ జేరిరే!॥
విశ్వాత్మ నాదిదేవుని మాయఁ దెలిసిరే!
భావాభావమున జీవభావ మెఱిఁగి, జ్ఞాన
భావముచేతఁ బరమపావనమైన శుద్ధ
॥జీవుని తావుఁ జేరిరే!॥

## 70

### ద్విపదార్థము

ద్విపద. ఎన్ని జన్మంబులు - ఎత్తిచూచినను
తన్నుఁ దాఁ దెలిసిన - తత్త్వజ్ఞులెల్ల
తిన్నఁగా నాసాగ్ర - దృష్టిచేఁ బండు

గేయం.॥వెన్నెలఁ జూచుచుండుదురే!॥
చిన్మయరూపుఁ గన్నులఁ గాంచుచుండుదురే!
ఉన్నతముగఁ బంచవన్నె చిలుక లూడఁ
దన్ని పొయ్యేటి జాడలన్ని శోధించి, పండు
॥వెన్నెలఁ జూచుచుండుదురే!॥

## 71

### ద్విపదార్థము

ద్విపద. కామాది గుణములు - గలుగు సంసార
పామరంబునఁ జిక్కు - బడనీక, చిత్త
మేమియుఁ గోరక, - మేటైన కోన

గేయం.॥సీమాలోఁ జూచుచుండుదురే!॥
సన్మోని యాత్మారాముని సేవఁ జేతురే!
నీమముతోను చందమామ దేశాము యేలే
ధామ మనేటి మోక్షకాము లుండేటి కోన
॥సీమాలోఁ జూచుచుండుదురే!॥

## 72

## ద్విపదార్థము

ద్విపద. కపట మార్గంబును - కడఁ జిమ్మి వేగ
అవరోక్ష లక్ష్యార్థ - మనుభవమునకు
నెపముచేఁ దరిగొండ - నేర్పునఁ జేరి

**గేయం.**॥తపము సాధించఁబొయ్యేరే!॥
ఓంకారగురుని కృప గలిగి నిపుణు లయ్యేరే!
విపరీతమైన విషయచాపల మణఁచి, మంచి
వుపము దెలిసి, జన్మ సఫలమయ్యేటి శాంత
॥తపము సాధించఁబొయ్యేరే!॥

## 73

## తత్త్వ కీర్తన

### నాదనామక్రియ రాగం, ఆది తాళం

గురుని భజించు జీవా! - ఓ అనాది జీవా! ॥పల్లవి॥
గురుని భజించు జీవా! - పదవి నీకేమి కొదువ? ॥అనుపల్లవి॥

అండాండములు శోధించి, - కుండలిని భేదించి,
కొండాపై నుండు జీవా! - ఓ అనాది జీవా! ॥గురుని॥ 1

బ్రహ్మాండ భాండములలో - బహిరంతరముగ వెలిఁగే
బ్రహ్మము నీవే జీవా! ఓ - అనాది జీవా! ॥గురుని॥ 2

సత్యజ్ఞాన మనంతమైన - ముక్తి నిదానమైన
సత్యము నీవే జీవా! - ఓ అనాదిజీవా! ॥గురుని॥ 3

తరిగొండ ఆదిశేషం - వరపతి సుబ్రహ్మణ్యం
గురుఁడని నమ్ము జీవా!- ఓ అనాది జీవా! ॥గురుని॥4

## 74

## తత్త్వ కీర్తన

### పంతువరాళి రాగం, ఆది తాళం

ఏల నీకు బుద్ధి లేదురా? - ఓరోరి! జీవా! ॥పల్లవి॥

ఏల నీకు బుద్ధి లేదు? - ఎవరితో నీకేల వాదు?
ఫాలభాగమందుఁ జూడారా! - భ్రమలన్ని యచట
భగ్నముగాఁ జెండి వీడరా! - వోరోరి జీవా! యేల నీకు బుద్ధి లేదురా?
॥అనుపల్లవి॥

జనసంగములోనఁ జిక్కి - సంతోషాన మేను సొక్కి నిన్ను నీవు జూడవేమిరా?
సంసార సుఖము యెన్నటికి - విడనాడరా! వోరోరిఁ జీవా ॥ఏల నీకు?1

అఱు చక్రములు నిలిపి - ఆఱుగురి గర్వ మణఁచి
మేరువపై నిలిచి చూడరా! మితి
మేరలేక మిన్ను లోను - మిన్ను చూడరా! వోరోరి! జీవా!॥ఏల నీకు?॥2

అడాండ, పిండాండములను - భేదించి, శోధించి, మించి,
ఖండమాయను ఖండించరా! - అన్నిట నిలిచి, అ
ఖండపదవి నిండించరా! వోరోరి! జీవా! ॥ఏల నీకు?॥3

యాయీ యాల తరి - గొండ నరహరినిఁ జేరి
పండు వెన్నెల బయలుఁ జూడరా!
దండిగ వెలిఁగే నిండు జ్యోతి నీలోఁ గానరా! వోరోరి! జీవా!॥ఏల నీకు?॥4

# 75

## తత్త్వ కీర్తన

### నాదనామక్రియ రాగం, చాపు తాళం

సద్వస్తువునందే నన్ను నిలుపరా! - సద్గురు నారాయణదేవ! ॥పల్లవి॥
అద్వయమై, పరమామృతమై, ఘన ని - రంజనమై వెలుఁగుచునుండెడు
॥సద్వస్తువునందే॥ అనుపల్లవి॥

ఇరువదియైదిటిఁ గూడి జనించిన - యీ స్థూలాంగము నే నొల్ల
సొరనగు......... గూడిన - సూక్ష్మ శరీరము నే నొల్ల
గరిమ నవిద్యా కరముగ వెలిఁగెడు - కారణ తనువును నే నొల్ల
సరవిని జాగ్రత్ స్వప్న సుషుప్తుల - జాడల నొందుట నే నొల్ల
॥సద్వస్తువు॥ 1

సారెకు జనన మరణంబుల కిరవైన - సంసారంబును నే నొల్ల
భూరి సుఖంబును, దుఃఖము నొసఁగెడు - పుణ్య,పాపముల నే నొల్ల
జారి మఱల దిగఁబడు హేతువులగు - స్వర్గ, నరకముల నే నొల్ల
తీర నణుత్వంబున తెగనీయని - దివ్యపదంబును నే నొల్ల
॥సద్వస్తువు॥ 2

ఖరకర మండల ముఖమండలముపై - కలసి మెలంగుట నే నొల్ల
పరఁగ మహాప్రళయమను మూల - ప్రకృతినిఁ బొమదుట నే నొల్ల
తిరిగి సుషుప్త్యాదుల నుదయించెడు - దీనదశలను నే నొల్ల
తరిగొండ నృ కేసరి వేంకట - గిరి వర! నిన్నిఁక విడువఁగ నే నొల్ల
॥సద్వస్తువు॥ 3

# 76

## తత్త్వ కీర్తన

### కాఫీ రాగం, చాపు తాళం

చెడుదంటె నేమి? మంచిది యంటె నేమి? నీవు ॥పల్లవి॥

తడఁబడుచును నింత - తపియించు టేమి? ॥చెడుదంటె॥అనుపల్లవి

దేహముఁ జూచి నిందించిన నేమి? - దేహి నెవ్వరు చూచి తిట్టిరీ డీభూమి?
సాహసికులకు నీకు సంవాద మేమి? - సాహాయ్యుఁడీ స్వామి
సర్వాంతర్యామి॥చెడు॥ 1

చిత్తమా! నిన్నుఁ జూచినవా రున్నారా? - చిత్తు లక్షణము లక్షించి కన్నారా?
సత్తసత్తులను విచారించినారా? - ఉత్త మాటల కింత యులికేది
మేరా?॥చెడు॥ 2

దూషణంబులు విని దుఃఖింపనేలా? - భూషణంబులఁ గని పొంగెదవె? బేలా!
ద్వేషులే హితులని తెలియవె! బాలా! - రోషముఁ ద్రుంచి, పోరుట మాను
మబలా!॥చెడు॥ 3

ఆశ కన్నను శత్రు వవనిలో లేదు - నా శత్రువీయాశ నను వీడిపోఁడు
క్లేశ మూలము దీని గెలువంగ రాదు - శ్రీశుఁడే దీని శిక్షింపక, పోదు॥చెడు॥ 4

ఉరగాద్రి పతియైన తరిగొండాధిపుఁడు - సరస ధర్మాధర్మ సాక్షి యైనాఁడు
నరు లాడు మాటలు నహి చాల వినఁడు - సొరిది దబ్బుఱ, నిజము చూచు
చున్నాఁడు॥చెడుదంటె॥ 5

# 77

## తత్త్వ కీర్తన

### కాఫీ రాగం, అట తాళం

సోऽహం సోऽహం - హం - సోऽహం సోऽహం ॥పల్లవి॥

సోऽహ మనరా! సతతం - హంసోऽహ మనరా! సతతం॥అనుపల్లవి॥

దూషణ మేలర? భూషణులకును, నీ మదిలోనే
రోష-రోష పడకురా! సతతం ॥సోऽహం॥ 1

మానక షడ్వర్గములను ఖండించి, మాయలో
మాయలో మాయఁ గనరా! సతతం ॥సోऽహం॥ 2

పొందుగ భ్రూమధ్య మందిరమందున
నాదులో నాదు గనరా! సతతం ॥సోऽహం॥ 3

కలఁగని మేల్కొని లో నిదానించి
వెలుఁగులో వెలుఁగును గనరా! సతతం ॥సోऽహం॥ 4

అంబరవీథిని ఆడుచు పాడుచుఁ జూచుచు నిరాలంబున
ముక్తిలో ముక్తినిఁ గనరా! సతతం ॥సోऽహం॥ 5

అరయఁగ శ్రీతరిగొండ నరహరి శంక
రాచార్యుఁడే యాచార్యులనరా! సతతం ॥సోऽహం॥ 6

## 78

# తత్త్వ కీర్తన

## కాఫీ రాగం, చాపు తాళం

శివుఁడంటే నేమి? కే - శవుఁ డంటే నేమి? ॥పల్లవి॥

శివ కేశవుల చిత్త - స్థితి భేద మేమి? ॥అనుపల్లవి॥

రతిరాజు భ్రమలచే - రట్టయ్యే దేమి?
మతిమంతుఁడైతె యీ - మతభేద మేమి? ॥శివుఁ డంటే॥ 1

మంచువంటిది దేహ - మని యెంచలేరు
మించుఁబోణులఁ గూడి - విఱ్ఱవీఁగేరు ॥శివుఁ డంటే॥ 2

మంచిది, కానిది మది నెంచలేరు
పంచేంద్రియంబులఁ - బడి పొరలేరు ॥శివుఁ డంటే॥ 3

ఆ మహాదేవుఁడే - అచ్యుతుఁ డాయె
శ్రీమహావిష్ణువే - శివరూప మాయె ॥శివుఁ డంటే॥ 4

ఈ మహాతత్త్వార్థ - మిది నిత్య మాయె
సోముఁడే నరసింహ - నాముఁడతఁ డాయె ॥శివుఁ డంటే॥ 5

తమకము పోదాయె - తాల్మి లేదాయె
తమగతిఁ గానక - తహతహ లాయె ॥శివుఁ డంటే॥ 6

స్వామి శ్రీతరిగొండ - నరహరి యాయె
సామాద్రి వాసుఁడే - శివశంభుఁ డాయె ॥శివుఁ డంటే॥ 7

# 79

## తత్త్వ కీర్తన

### ఆనంద భైరవి రాగం - అట తాళం

జ్యోతి వెలుఁగుచున్నదమ్మా! దాని - లోతు తెలియరాదె కొమ్మా!

॥పల్లవి॥

పాతాళ గగనకళా తీతమై సర్వ - భూతములందుఁ బ్రఖ్యాతిగఁ బరమాత్మ

॥జ్యోతి॥ అనుపల్లవి॥

ఎవరిచేఁ జిక్కదోయమ్మా! దాని - విధ మిట్టిదని చెప్పరాదు గదమ్మా!
శివకేళిలోఁ గూడి సిద్ధేందు భావమై - భువనైకమైచాల బుధులందు
నా యాత్మ ॥జ్యోతి॥ 1

మాయలో మాయైనదమ్మా! దాని - మహిమ తెలియఁగూడదమ్మా!
మాయకు లోఁగాను, మాయకు వెలిఁగాను - రేయి పగలు నొక్క రీతిగ
॥జ్యోతి॥ 2

నానారూపములైనదమ్మా! తిరిగి - తాను తానై యున్నదమ్మా!
పూని త్రికూట నిత్యానంద వార్ధిలో- జ్ఞానముతోను నిదానముగా నాత్మ
॥జ్యోతి॥ 3

కనకమయమై యున్నదమ్మా! తిరిగి - కనవచ్చు, కనరాదో యమ్మా!
ఫణితోడఁ గూడుకఁ - పగలు రే యొక రీతి తనువులోపల నీల తామరసము
నందు॥జ్యోతి॥ 4

ఎఱుకలో నెఱుకైనదమ్మా! సర్వ - మెఱిఁగే సాక్షియై యున్నదమ్మా!
పరమాణువై, విశ్వపరిపూర్ణముగ నాత్మ - గురు చంద్రుఁడగు శ్రీతరిగొండ
నరహరి రూపమున ॥జ్యోతి॥ 5

# 80

## తత్త్వ కీర్తన

### ఆనంద భైరవి రాగం - ఏక తాళం

బ్రహ్మమేదో తెలుపరయ్యా! - బ్రాహ్మణులారా! ॥పల్లవి॥

పరబ్రహ్మమేదో తెలుపరయ్యా - బ్రాహ్మణులారా! ॥అనుపల్లవి॥

బ్రహ్మమేదో తెలుపరయ్యా! - భ్రాంతిలేక జీవునకూ
కర్మ రహితమైన మోక్ష - గతికి పొయ్యేటందుకూ ॥బ్రహ్మ॥ 1

నిర్మలాంతః కరణులగుచు - 'నిత్యం ఏకాక్షరం పర
బ్రహ్మ సత్యం'బను శ్రుతి మీ - రెఱింగినందుకు ॥బ్రహ్మ॥ 2

బ్రహ్మకర్మములను జేసికొనుచు గా - యత్రి మంత్రము చదివి
బ్రహ్మ సూత్రమందు నిష్ఠ - 'బ్రహ్మాధిపతిః బ్రాహ్మణో మమదేవతా' యను
భావ మెఱింగినందుకు ॥బ్రహ్మ॥ 3

రేపు మాపు సంధ్య వార్చి - రేచించి ఓంకారమందు
'ఆపోజ్యోతిః హంసోఽహం - స్వాహేతి'యని మీ రెఱింగినందుకు
॥బ్రహ్మ॥ 4

యజ్ఞ, క్రతువు లనుచు మీరు - యోగము, యాగము చేసి
'భర్గో దేవస్య ధీమహి సవితృ - ర్భవతి' భావం బెఱింగినందుకు
॥బ్రహ్మ॥ 5

ప్రాణాపానవ్యానో, దాన, స - మానములను గూర్చి
ప్రణవ ధ్యానులై- వేదాంతం, సోమ - పానం, యజ్ఞం, స్వర్గం- అని మీ
రెఱింగినందుకు ॥బ్రహ్మ॥ 6

ప్రొద్దెఱింగి ప్రొద్దున లేచి - ప్రొద్దు చెప్పే పంచాంగం
సుద్దులందు 'ఓం నమో - సిద్ధ ప్రజాపతిం ధ్యాయే'యని మీ రెఱింగి
నందుకు॥బ్రహ్మ॥ 7

నిందు వేదుకతో తరి - గొండ భ్రమరాంబ ఊర్ధ్వ
కుండలి ప్రణవ మహత్త్వం - సుబ్రహ్మణ్య గురుఁడని మీ రెఱిఁగి
నందుకు॥బ్రహ్మ॥ 8

## 81

## తత్త్వ కీర్తన

### నాదనామక్రియ రాగం - అట తాళం

జీవా! నీవు నిను@ గానలేవా? - నిన్ను ॥పల్లవి॥
భావించి చూచితే - బ్రహ్మమే కావా? ॥జీవా!॥ అనుపల్లవి॥

పరఁగ దేహము మేడి - పండు, లోన
తఱచుగ పురుగులు - తొలిచెడు పండు
తెఱచాటు మాంసపు - దిండు, దీని
తెఱఁగెల్ల చక్కఁగాఁ - దెలిసితే బండు ॥జీవా!॥ 1

మునుకొని తొమ్మిది తూట్లు
ఈ, తనువు కారణమని- తగ నమ్మెదెట్లు?
కనుఁగొని దీనిలో - గుట్లు, చాల
పనిఁబూని వినఁబోతే - బహు సిగ్గుబాట్లు ॥జీవా!॥ 2

బలు రోగముల కిది - బాట, దీని
వలపు సొలపులెల్ల - వడగండ్ల మూట, నీవు
నిలిచెతె తెలిసేవు - నీ కిదె బాట ॥జీవా!॥ 3

పరఁగ దేహము మంటి - పాలు, ఈ వికట సం
సారము- విడుచుటే మేలు
సకల భోగము లిఁక - చాలు, శ్రీ
అకలంక తరిగొండ - హరివై మమ్మేలు ॥జీవా!॥ 4

## 82

## తత్త్వ కీర్తన

### ఆనంద భైరవి రాగం - ఆది తాళం

శ్రీగురుని కొనియాడవే! ఓ రాజహంసా! ॥పల్లవి॥

రాజయోగివై వెలుఁగుచుండవే! ఓ రాజహంసా! ॥అనుపల్లవి॥

ఐదు పద్మములమీఁద రాజహంస! నీవు
ఆఱవ పద్మము చూడవే! ఓ రాజహంసా! ॥శ్రీగురుని॥ 1

దండి తేజమై యున్నదే! రాజహంస! చూడ
రెండు రేకులున్నవే ఓ రాజహంసా! ॥శ్రీగురుని॥ 2

రెండు రేకుల నడుమ రాజహంస! చాల
నిండు గంగ, యమున లుండు ఓ రాజహంసా! ॥శ్రీగురుని॥ 3

నిండు గంగ, యమునలలో రాజహంస! చాల
చండ, చంద్ర కిరణము లుండు ఓ రాజహంసా! ॥శ్రీగురుని॥ 4

చండ, చంద్రకిరణములలో రాజహంస! నడి
కుండలి రూపమున్న దే ఓ రాజహంసా! ॥శ్రీగురుని॥ 5

కుండలి తుద వెళ్ళేవేళ రాజహంస! అల్ల
ఘోష వినవచ్చునే! ఓ రాజహంసా! ॥శ్రీగురుని॥ 6

నాద, బిందువులలో రాజహంస! కళ
భేద రహితమై యున్నదే! ఓ రాజహంసా! ॥శ్రీగురుని॥ 7

సచ్చిదానందభావము రాజహంస! నీవు
సత్యమని తెలియవే! ఓ రాజహంసా! ॥శ్రీగురుని॥ 8

'చిత్త'నఁగ 'త్వం' పదము రాజహంస! అల్ల
'సత్త'నఁగ 'తత్' పదము ఓ రాజహంసా! ॥శ్రీగురుని॥ 9

ఆనందమే 'అసి' పదము రాజహంస! పూని
తాను తానె యున్నదే ఓ రాజహంసా! ॥శ్రీగురుని॥ 10

కానవచ్చే చోట నది రాజహంస!
కనుకంటఁ జూచి తెలియవే! ఓ రాజహంసా! ॥శ్రీగురుని॥ 11

చూపు రూపు నొకటిఁ జేసి రాజహంస! అందు
చూడఁగ బయలవునే! ఓ రాజహంసా! ॥శ్రీగురుని॥ 12

దృక్, దృశ్యములు లేక రాజహంస! అందు
తెలివి తుర్యమై యున్నదే! ఓ రాజహంసా! ॥శ్రీగురుని॥ 13

నిర్గుణ జ్ఞప్తి మాత్రమే రాజహంస! అందు
నిర్మల పరిపూర్ణమవుదువు ఓ రాజహంసా! ॥శ్రీగురుని॥ 14

పిండాండ బ్రహ్మాండములు రాజహంస! అందు
పెనఁగొని లయమవునే! ఓ రాజహంసా! ॥శ్రీగురుని॥ 15

సంశయము విడువవే! రాజహంస! పరమ
హంస భావము తెలియవే! ఓ రాజహంసా! ॥శ్రీగురుని॥ 16

ఖండభావము విడువవే! రాజహంస! శ్రీతరి
గొండధామునిఁ గూడవే! ఓ రాజహంసా! ॥శ్రీగురుని॥ 17

## 83

# తత్త్వ కీర్తన

## షహానా రాగం- చాపు తాళం

ఎందుకే! నీకింత మోహము? చిత్తమా? పరమా ॥పల్లవి॥

నందమా? కైవల్యమా? యీ దేహము ॥అనుపల్లవి॥

పందవై యింద్రియ విషయ బృందములను దిరిగి, నీవు
క్రింది మీదు తెలియలేక అందమా? చందమా? ఆనందమా?
॥ఎందుకే!॥ 1

శ్రీధరుని పూజసేయవే! సాధుల కనపరాధివై సంగతిఁ బ్రోవవే!
సాధనసంపత్తి సదేహ సాధనలే, కీ ప్రపంచబోధలచే విపరీతమైన బాధలే,
వాదాలే॥ఎందుకే!॥ 2

దిక్కు దిక్కులాను జూడఁగ పరమాత్మ రూప మొక్కటై దీపించుచుండఁగ
చక్కఁగా నీవు కానలేక, కుక్కవై సంచరించేవు, తక్కెడైన యీ మాయలో
చిక్కకే! సొక్కకే! నిక్కకే! ॥ఎందుకే!॥ 3

కుండలి శైలాగ్రమందున భాసిల్లు తరిగొండలో నడివీథి సందున
చండకిరణ, తార, చంద్ర మండల మధ్యమందు పండువెన్నెలలో నీవు
నుండవే! పండవే! నిండవే! ॥ఎందుకే!॥ 4

## 84

## తత్త్వ కీర్తన

విషయము : వేదాంతము (ఆశురచన)

సర్వం బ్రహ్మమయం – సద్గురురాయా!
సర్వం బ్రహ్మమయం ॥పల్లవి॥

సర్వం బ్రహ్మం – సాక్షి రూపం
నిర్మల చిత్తం – నిత్యానందం ॥సర్వం॥ అనుపల్లవి॥

సప్త జలజములు – సరగున దాటితి
గుప్తంబగు ఆ – గుటిలోఁ గలసితి ॥సర్వం॥ 1

ముగ్గురి పదమగు – ముక్తినిఁ గాంచితి
త్రిగుణము లణఁచితి – ధీరతఁ గాంచితి ॥సర్వం॥ 2

గురుతరముగను త్రి – కూటముఁ గాంచితి
ఎనసి నినుంగని – నేనే నేనైతిని ॥సర్వం॥ 3

గొనకొని ఘనతరి – గొండ నృకేసరి
యెఱుకలోని యెఱు – కే నే నైతిని ॥సర్వం॥ 4

# 85

## తాత్త్విక గేయం

**సూచన : ఈ గేయం 36 చరణాల్లో సుదీర్ఘంగా కొనసాగింది.**

ఏమి చెప్పుదు? పరమ గోప్యము – ఎందు తోఁచక యున్నదీ
ఏమి గాకను, ఏమి లేకను – ఏమి యేమనరానిదీ ||పల్లవి||

ఎప్పుడందును, అప్పుడందును – చప్పుడందును లేనిదీ
తప్పుదారులు పల్కు జనులకు, తార్కులకు అది లేనిదీ ||ఏమి|| 1

అంతరాంతర మేమి లేక ని – రంతరము తానైనదీ
వంత లేమియు లేక, అది అ – త్యంత శాంతంబైనదీ ||ఏమి|| 2

అందు నిందును ఎందుఁ జూచిన – అందె తానై యున్నదీ
సందు లేకను, ఎందుఁ బోకను – అందిపొందిక లేనిదీ ||ఏమి|| 3

ముద్ర, ఆపోజ్యోతి – ఆదిగ మూర్తి ఆశలు లేనిదీ
భద్రమైనది, గోప్యమైనది – భావగోప్యంబైనదీ ||ఏమి|| 4

వేద, శాస్త్ర, పురాణమవు కథ – వేద్య మెన్నడు కానిదీ
వాదభేదముఁ జేయు మూర్ఖుల – వశముగాకను వున్నదీ ||ఏమి|| 5

చిక్కు లేకనె సాధనం బిది – చిత్ర మెన్నడు కానిదీ
దృక్కు దృశ్య వివేకులకు అది – దూర మెన్నడుఁ గానిదీ ||ఏమి|| 6

నిదుర, మఱపులు లేనిదీ, అది – నీవు నే ననరానిదీ
ఎదురుపడి వాదించువారికి – ఎన్నడూ అది లేనిదీ ||ఏమి|| 7

పట్టు, విడుపులు లేనిదీ, అది – పరమ రహితం బైనదీ
గుట్టు మీఱినవారి కే యెడ – గుర్తు లేకనె యున్నదీ ||ఏమి|| 8

శూన్య మెన్నడు కానిదీ, పరి - శుద్ధమై తానున్నదీ
శూన్యులై చరియించు శరణుల - స్వర్గమై తా నున్నదీ ॥ఏమి॥ 9

తను, మనంబులు లేనిదీ, అది - 'తత్త్వమసి' యనరానిదీ
తనకుఁ దానె నిరాలంబమై - తానె తా ననరానిదీ ॥ఏమి॥ 10

కార్యమేమియు లేక సర్వము - కల్పితంబనరానిదీ
ఆర్యులము మే మన్నట్టి వారికి - ఆద్యమై తా నున్నదీ ॥ఏమి॥ 11

అంగ త్రివిధము గానిదీ, అది - సంగరహితం బైనదీ
అంగషడ్విధ భావ లీలను - హీన మెన్నడు గానిదీ ॥ఏమి॥ 12

భావలింగము కానిదీ, ని - ర్భావ మెన్నడు కానిదీ
సావయవమూ, నిరవయవమూ - స్వగత భేదము లేనిదీ ॥ఏమి॥ 13

యుగయుగంబుల కందరానిది - యుక్తియుక్తము గానిదీ
త్రిగుణరహితం బగుచు ఆంతర - త్రిపుటి రహితం బైనదీ॥ఏమి॥ 14

ఎన్న శక్యము కానిదీ, అది - యున్నదే తానైనదీ
కన్నవారికి ఉన్నదీ, అది - కవుతుకం బనరానిదీ ॥ఏమి॥ 15

నిరాకారాకారముల కది - నిలయమనఁగాకున్నదీ
నిరాధారాధారముల కది - నిరాధారం బైనదీ ॥ఏమి॥ 16

సృష్టి కల్పన లేనిదీ, అది - సూక్ష్మరహితంబైనదీ
వ్యష్టి నామ నిరంతరంబై - భేదవాదము లేనిడీ ॥ఏమి॥ 17

వాచ గోచరమైనదీ అది - తోఁచి తోఁచక యున్నదీ
ఉచ్ఛనీచము లేనిదీ, నిజ - గురుసూచనకు లోనైనదీ ॥ఏమి॥ 18

అచల మెన్నడు కానిదీ, అది - ఆపోబ్రహ్మము కానిదీ
సచలులై చెడిపొయ్యె వారికి - చాల దూరంబైనదీ ॥ఏమి॥ 19

కామరహితము, నేమ రహితము - ప్రేమరహితంబైనదీ
మా మతము దొడ్డదనియెడి - మానవుల కది లేనిదీ ॥ఏమి॥ 20

ఒకటి యున్నదనేది లేకనె - యొకటి యెక్కటి కానిదీ
తగని పద్ధతి కెల్ల సాంప్ర - దాయకుల కది లేనిదీ ॥ఏమి॥ 21

కాక కావలెనన్న సూచన- లందు లేదనరానిదీ
లోకవాసన విడువనేరక - లోకులకు అది లేనిదీ ॥ఏమి॥ 22

నిత్యమైనది నిరుపమైనది - నిర్వికారంబైనదీ
సత్యాసత్యము రెండు గానిది - స్వల్పమతులకు లేనిదీ ॥ఏమి॥ 23

అక్షరాక్షరాతీతమైనది - ఆత్మభావన లేనిదీ
అక్షిశూన్యంబైన వారికి - ఆ క్షణమె తానై యున్నదీ ॥ఏమి॥ 24

ముట్టరానిది, పట్టరానిది - మూల మెన్నడు లేనిదీ
బట్ట బయటను ఉన్నదీ, అది ప్ర-త్యక్ష మెవరికిఁ గానిదీ ॥ఏమి॥ 25

ఉన్న దన్నది లేనిదీ, అది - వూరకున్నది కానిదీ
కన్నవారికి వున్నదీ, అది - కానబడుతూ వున్నదీ ॥ఏమి॥ 26

తోడు లేనిది, నీడ లేనిది - తోడు తోడనె యున్నదీ
జాడ తెలియని వారి కియ్యెడ - ఏడ జూచిన లేనిదీ ॥ఏమి॥ 27

బోధసాధన లేనిదీ - బోధరహితం బైనదీ
సాధుబోధల కంది యందక - సార్ధకంబై యున్నదీ॥ ఏమి॥ 28

ఇష్ట మెన్నడు లేనిదీ, అది వి - శిష్ట మెన్నడు కానిదీ
అష్టమూర్తుల కావలావల - నంతమై తా నున్నదీ ॥ఏమి॥ 29

ఇతర మెన్నడు లేనిదీ, అది - ఇంత అంతనరానిదీ
పతితులై విలసిల్లు మూర్ఖుల - గతికి దూరంబైనదీ ॥ఏమి॥ 30

ఊరు లేనిది, పేరు లేనిది - వేరు లేకనె వున్నదీ
దారి చరించు దుర్గుణ - తాపసుల కది లేనిదీ ॥ఏమి॥ 31

పంచవింశతి యాత్మ కానిది - పంచవింశతి కానిదీ
సంచితము, ప్రారబ్ధ మనియెడి - సంశయంబది లేనిదీ ॥ఏమి॥ 32

ఆది సన్మునివరుల కెల్ల న - భేద్యమై తానున్నదీ
వేదమత సిద్ధాంతముల కది - వేద్య మెన్నడు గానిదీ ॥ఏమి॥ 33

ఏది వేరై యేమి విననిది - ఏమి లేకనె యున్నదీ
ఏది యేదియు లేకనే తా - నేకమై తా నున్నదీ ॥ఏమి॥ 34

తాననే యెఱుకేమి లేనిది - ధర్మాధర్మము గానిదీ
తాననే అద్వైత వాదుల తరము గాకనె యున్నది ॥ఏమి॥ 35

మనసు లేనిది గనుక, అది అమ - నస్కమనరాకున్నది
ఘనులమను హఠ, రాజయోగుల - కలవిగాకున్నదీ ॥ఏమి॥ 36

## 86

## తత్త్వ కీర్తన

నా దేహము నీ కర్పితమూ
నారాయణ! గురు! కృష్ణా! స్వామీ! ॥పల్లవి॥

క......... దానీ విడనాడాకా
గైకోరా! సర్వాంతర్యామీ!
నా దేహము నీ కర్పితమూ
నారాయణ! గురు! కృష్ణా! స్వామీ! ॥ ఉపపల్లవి॥

నేను నిదురc జెందుటాలూ

నీ ధ్యానా పరవశత్వమూలూ,

నేను కూర్చుండి యుండుటాలూ

ని న్నర్చించే సంకల్పమూలూ,

నేను పలికిన పలుకూలూ

నీ నామమంత్ర జపమూలూ,

నేను జేసిన పనులూ

నీ నిత్య కైంకర్యమూలూ

॥నా దేహము నీ కర్పితమూ॥ 1

.......... నా శబ్దమూలూ

నీ ప్రతాపాంకితా కృతులూ,

నేను చూచినా రూపూలూ

నీ మూర్తి సాక్షాత్కారామూలూ,

నే నాలంబించుటాలూ

నీ విగ్రహాలింగనమూలూ,

నే ననుభవించుచుండుటాలూ

నీ భుక్త శేషాన్నములూ

॥నా దేహము నీ కర్పితమూ॥ 2

నే నాఘ్రాణించు గంధమూలూ

నీ పాదార్పిత పుష్పములూ,

నేను నడచిన నడపూలూ

నీ ప్రదక్షిణ విధులూ,

నేను పవ్వళించుటాలూ

నీ దండ ప్రణామములూ,
నేను తలచిన తలపూలూ
నీ కరుణానుభవమూలూ
॥నా దేహము నీ కర్పితమూ॥ 3
నేను నిదురా జెందుటాలూ
నీ ధ్యానాపరవశత్వమూలూ,
నేను కలలాఁ గాంచుటాలూ
నీ లీలా వినోదమూలూ,
నేను సుషుప్తి నొందుటాలూ
నీయం దైక్యమై యుండుటాలూ,
నే నిట్లా జీవించుటాలూ
నీ యనుగ్రహా బలమూలూ
॥నా దేహము నీ కర్పితమూ॥ 4
శ్రీ తరిగొండా మా నారసింహా!
శేషాచలా విహారా!
నా తప్పులన్నీ గావారా!
నన్ను నీ వాదరించారా!
నా తలంపులో నుండారా!
నా పాపమూల చెండాడారా!
నాతంద్రీ! మోసపొయ్యా రా!
నా కన్యా మింకే నొల్లారా!
॥నాదేహము నీ కర్పితమూ
నారాయణ! గురు! కృష్ణా! స్వామి!॥ 5

## 87

## తత్త్వ కీర్తన

హరి! కృష్ణ! శ్రీకృష్ణా! ॥పల్లవి॥

కోరీ, సద్గురుని పాద పద్మములు చేరీ
చాల శుశ్రూష లొనరించి, వారీ
సత్కటాక్షంబనే క్షీరవారీ
లోన ఓలలాడుచు తత్త్వధారీ!
తెలిసి కామాది శత్రువులతో పోరీ
సంహరించుచు తత్త్వాధికారీ
యైన ధన్యుఁడె సర్వసంచారీ
॥హరి! కృష్ణ! శ్రీకృష్ణా!॥ 1

వట్టి మోహపాశంబులను చుట్టి పట్టీ
కోరి ఈషణత్రయములను ముట్టీ
పొందియున్న యవిద్య పోగొట్టీ
అందు మోక్షానుసారమైనట్టీ
మేటి చిత్కళను మనసులో బెట్టీ
యున్న యోగి వెల్గును నింగి ముట్టీ
॥హరి! కృష్ణ! శ్రీకృష్ణా!॥ 2

పొంచి కృత విధి మాయామృగముఁగాంచీ
నేత్ర దృష్టి భ్రూమధ్యమం దుంచీ
ప్రణవ నాదంబు మనసు నాలించీ
ఆ నాదమున బుద్ధి నాటించీ
ఆ బుద్ధిలో నిర్గుణంబూనీ
తన్ను చింతించువాడె విరించీ
॥హరి! కృష్ణ! శ్రీకృష్ణా!॥ 3

పొంచి కనకాద్రి విల్లు గావించీ
ఫణి నారిగాను సవరించీ
హరి యనెడి శరము సంధించీ
త్రిపురములమీఁద దృష్టించీ
ముల్లోకములను సాధించీ
నట్టి వాని జన్మమె మంచీ
॥హరి! కృష్ణ! శ్రీకృష్ణా!॥ 4

బూటకంబైన మాయా కపట నాటా
నిశ్చయముఁ దెలిసి త్రికూటా
మునను చేరి వేదాంతైక్య బాటా
వెల్గు లోపల వెల్గు ఘనవెల్గు తేటా
॥హరి! కృష్ణ! శ్రీకృష్ణా!॥ 5

చాలా నిర్భరానందమున చొక్కి ఫాలా
భాగమున వెల్గుచుండు ఘనలీలా
తామరస మధ్యమున మోక్ష బాలా
పొందు చేరి పరతత్త్వైక్యలీలా
యైన నిర్గుణ క్లప్తి నే వేళా
వెల్గుచున్నట్టి చిదాత్ముఁడె చాలా
శూలపాణి యనదగును సందేహమేలా?
॥హరి! కృష్ణ! శ్రీకృష్ణా!॥ 6

ఈశా! శరణయ్యా! సర్వలోకేశా!
సద్భక్త కోటి ప్రకాశా!
నగధీర! చంద్ర సంకాశా!
నన్ కరుణఁ జూడు సోమేశా!
॥హరి! కృష్ణ! శ్రీకృష్ణా!॥ 7

స్త్రీలూ, మోహానఁ గన్న పుత్రూలూ
లోభమునఁ గూర్చు వరహాలూ
ఇది గాక, మాన్య క్షేత్రాలూ
ఇది నిజమని నమ్ము కర్మాలూ
ఎత్తేది పాపజన్మాలూ
ఇక, యెత్తుటకు యెన్నటికి చాలూ
మును రాజయోగిదే మేలూ
॥హరి! కృష్ణ! శ్రీకృష్ణా!॥ 8

ఖండా వృత్తులను జయించి, యఖండా
జ్యోతి స్స్వరూపమున నుండా
నమరఁగా పిండాండ
భావంబుఁ గాంచి బ్రహ్మాండా
మూలంబుఁ దెలిసి యుండుండా!
ఆ ధారుణి ధిక్కరించియుండుండా!
అతడే మహాత్ముఁడానండా!
మీరు చక్కగా సేవ చేయండా!
ఉపదేశమియ్య మనండా!
ఆ బోధ ఆలకించండా!
అజ్ఞానము సోకనీకండా!
గురు నేమరియుండఁబోకండా!
గురునందు భక్తి నిలుపండా!
శృంగాటకమున చూడుండా!
ఆ చూపులో చిత్కళల్ గనండా!
చిత్కళలో మిమ్ముఁ జూడుండా!
ఏ వేళ ఘనతరీగొండా
వీరనరసింహుఁడే నిజమనుకొండా!
"హరి! కృష్ణ! శ్రీకృష్ణా!॥ 9

## 88

## దరువు- ఆది తాళం

*విషయము : గణనాయకుని రాక (జలక్రీడావిలాసము)*

గణనాయకుఁడు వచ్చెనూ; నటింపుచు
గణనాయకుఁడు వచ్చెనూ ॥పల్లవి॥
గణనాయకుఁడు వచ్చె - గజ్జె లందెలు మ్రోయ
ఘణ ఘణామని మొల - ఘంటలు గదలఁగ ॥గణనా॥ఉపపల్లవి॥
ముజ్జగముల కాది - మూలాము తానని
బొజ్జల్లాడింపుచు - భూరి తేజముతోడ ॥గణనా॥ 1
వేడుకగా జల - క్రీడా విలాసాము
నాడాడ వృద్ధిఁ జే - యఁ దలంచి, ముదముతో ॥గణనా॥ 2
వర తరిగొండ ని - వాసుఁడు వేంకట
గిరివాసుఁడగు బాల - కృష్ణ చర్యలు జూడ ॥గణనా॥ 3

## 89

## చూర్ణిక

*విషయము : శ్రీకృష్ణావతారవేళ దేవకీదేవి స్తుతి (జలక్రీడావిలాసము)*

శ్రీమదఖిల స్థావర జంగమాత్మక ప్రపంచ హేయగుణ వికారసముద యాతీత స్వయంప్రకాశం ఘోరతర కలికలుషనాశం 1

అపరిమిత సుందర సుకుమార నవయౌవనాలంకృత స్వశరీర విజిత శతకోటి మన్మథ ధనం సత్య ధర్మక్షాత్ర సదనం. 2

సకల విశ్వ సర్జన కారణ పరాది జ్ఞానేచ్ఛాక్రియాశక్తి ప్రముఖానేక ప్రబల శక్తి సమేతం నిఖిలనిగమాంత నిర్ణీతం 3

బహు విచిత్ర మాయావినిర్మిత బ్రహ్మాండ భాండ బృంద భరితానంత శరీరం సచ్చిదానంద సారం. 4

అనేక జన్మ పుణ్యపరిపాక జ్ఞానభక్తి ప్రకాశాతిశయ పరమ భాగవత జన పరివృత శేషశైలాగ్ర నివేశం తరిగొండ పురవరాధీశం లక్ష్మీమృగేశం

ఽహం భజేఽహం భజేఽహం. 5

## 90

## దరువు (జావిడి)

***విషయము : గోపభామలు పెరుఁగు చిలుకటం (జలక్రీడా విలాసము)***

చిలుకరమ్మా! బిరబిర పెరుఁగూ చిలుకరమ్మా! ॥పల్లవి॥

చిలుకరమ్మా! ము - ద్దుల గోపాలుఁడు
తులువై కుండలు - ద్రోయక మునుపే చిలుకరమ్మా ॥ఉపపల్లవి॥

సందుల గొందుల - యందులఁ బొంచుచు
ముందరఁ గృష్ణుఁడు - మొనయక మునుపే ॥చిలుకరమ్మా!॥ 1

దాగుచు, మూఁగుచు - నాగడపఱచుచు
మీఁగడఁ గొని వాఁడు- మెక్కక మునుపే ॥చిలుకరమ్మా!॥ 2

కిలకిల నవ్వుచు - ఖేలలు జూపుచు
బలు కవ్వంబులు - పట్టక మునుపే ॥చిలుకకరమ్మా!॥ 3

గిరగిర కవ్వము - లఱిముఱిఁ దిరుగఁగ
నొరసిన మెఱుఁగుల - నురుఁగులు గరఁగా ॥చిలుకరమ్మా॥ 4

తరిగొండాధీ - శ్వరుఁడగు వేంకట
గిరి నిలయుండగు - కృష్ణుఁడు వచ్చీ ॥చిలుకరమ్మా!॥ 5

## 91

### విషయము : గోపికలు యశోదతో పల్కిన పల్కులు (జలక్రీడా విలాసము)

### దరువు, ఆట తాళం

గోపెమ్మా! యేమె గోపెమ్మా! ॥పల్లవి॥

గోపెమ్మా! మావల్ల - పాపాము లేదు, నీ
వీపట్ల మా మీఁద - కోపాముఁ జేయకు॥గోపెమ్మా!॥ ఉపపల్లవి॥

ఇట్టి లోకాతీతుఁ - డీ వూరిలోఁ బుట్టఁ
బట్టి మా బ్రతుకూలు - బంగారమై పోయెనే! ॥గోపెమ్మా!॥ 1

బాలకుఁడని నీవు - భావింపుచున్నావు
బాలుఁడు గాఁడు; నీ - పాదము లాన! వో ॥గోపెమ్మా!॥ 2

చిన్ని కుఱ్ఱలను - జూచితిమమ్మ! భూమిలో
నిన్ని నేర్చిన కుఱ్ఱ - నెఱుఁగ మెచ్చోటను ॥గోపెమ్మా!॥ 3

రమణిరో! యివి మత్స - రంపు మాటలు గావు
క్రమముగా నడుగు మి - క్కడివారి నెల్లాను ॥గోపెమ్మా!॥ 4

పాదైనా తరిగొండ - పతితోడె! నీ బిడ్డ
మీఁద దబ్బఱ చాడి - మేము జెప్పలేదే! ॥గోపెమ్మా!॥ 5

## 92

విషయము : యశోదాదేవి వ్రేపల్లెలోకి వెళ్లుతున్న శ్రీకృష్ణుని పిలవటం
(జలక్రీడావిలాసము)

### దరువు

ముద్దుకృష్ణా! రారా! వెన్న - ముద్ద లిచ్చే కోరా! ॥పల్లవి॥

హద్దు విడిచి నీ వెందుఁ బో - వద్దు, వద్దు రారా! ॥ఉపపల్లవి॥

పొరుగిండ్లాకుఁ బోయి లేని - పోరు దేక రారా!

యిప్పు, దరసి యింట్లో రామునితో - నాట్లాడుదు రారా!

॥ముద్దుకృష్ణా!॥ 1

పొరుగిండ్లాలో పొంచి పెద్ద - బూచి వుంది రారా!

గోళ్ల బరికీ బరికీని, బొజ్జంతా - కఱచిపొయ్యా రారా ॥ముద్దుకృష్ణా!॥ 2

బొజ్జా వాడెను, పాచాలు - బువ్వా బెట్టే రారా!

మొల, గజ్జాలు వదలీనావి - గట్టిగఁ గట్టే రారా! ॥ముద్దుకృష్ణా!॥ 3

పరువు లెత్తితేను నిన్నుఁ - బట్టలేను రారా!

గొల్ల గరితాలు గొట్టేరు - బొజ్జ కందవాఁడా! రారా!॥ముద్దుకృష్ణా!॥ 4

తరిగొండ నరహరి తోడే! కడప - దాఁటిపోక రారా!

వోరి! దురుసూగా పరువులెత్తక - తులువాబిడ్డా!రారా

॥ముద్దుకృష్ణా!॥ 5

## 93

**విషయము : తల్లి రామకథను చెప్పగా, వింటూవున్న శ్రీకృష్ణుడు ఆవేశంతో పల్కిన పల్కులు (జలక్రీడా విలాసము)**

### దరువు, ఆది తాళం

తేరా! లక్ష్మణ! – తే విల్లమ్ములు ॥పల్లవి॥
ధారుణిసుతఁ గొని – దనుజుఁడు చనె నిటు
॥తేరా! లక్ష్మణ!॥ఉపపల్లవి॥

దశకంధరు ని – ర్ధరపైఁ – గూల్చెద
శశినిభముఖియగు – జానకిఁ దెచ్చెద ॥తేరా! లక్ష్మణ!॥ 1

అదె చనుచున్నాఁ – డదిగో దనుజుఁడు
కొదుకక ధరపైఁ – గూల్చెద నిప్పుడు ॥తేరా! లక్ష్మణ!॥ 2

తరిగొండ నృకే – సరి నే నైనను
సురరిపు నిక్కడ – సూటిగఁ గూల్తును ॥తేరా! లక్ష్మణ!॥ 3

## 94

**విషయము : కాళియ సర్పముచే చుట్టబడిన శ్రీకృష్ణుని గాంచిన యశోద పొందిన ఆరాటం (జలక్రీడా విలాసము)**

### దరువు, ఆది తాళం

నా చిన్ని కృష్ణా! – నాయన్నా! ॥పల్లవి॥
ఈ చందంబున – నీ నీరములో
నీ చెడుపామున – కెటు జిక్కితివో? ॥నా చిన్ని కృష్ణా!॥ఉపపల్లవి॥
కటకట! నిన్నీ – కాకోదర మిపు

డిటు చుట్టెను; నే - నెటు విడిపింతుర? ॥నా చిన్ని కృష్ణా!॥ 1
నీ ముద్దులు, మఱి - నీ జిగి సుద్దులు
నీ మురిపెంబులు - నీ నెటు మఱతుర? ॥నా చిన్ని కృష్ణా!॥ 2
తరిగొండ నృకే - సరి కరుణను మా
వెఱపుఁ దీర్చి నిను - విడిపింపఁవలె ॥నా చిన్ని కృష్ణా!॥ 3

## 95

**విషయము : గోపికలు జలక్రీడలాడబోవుచు పల్కిన పల్కులు (జలక్రీడావిలాసము)**

### దరువు, ఆది తాళం

చేడె లంద తీడ జల - క్రీడ లాడరే! ॥పల్లవి॥
కృష్ణుఁ, డాడూచు నీడకు వచ్చే - జాడఁ జూడరే!
॥చేడె లంద తీడ॥ ఉపపల్లవి॥

పొలంతులార! యీ చెంగల్వ - పూలు గోయరే!
యిందు, కులుకూచు నాడే తుమ్మెద - గుములఁ ద్రోలరే!
॥చేడె లంద తీడ॥ 1

కమలనాళమూల మెల్లఁ - గా గ్రహించరే!
పెద్ద, కమలమూలు గోసి కోసి - గట్టు నుంచరే!॥చేడె లంద తీడ॥ 2

నల్లకలువా లందుఁ గోసి - నా కందియ్యరే!
అల్ల, తెల్ల కలువాలన్ని పట్టి - తీసి యొసఁగరే! ॥చేడె లంద తీడ॥ 3

దురుసూగ తరంగములు - ద్రోయుచున్నారే!
మీరు, వెఱవా కొక్కరీని - విడువాకుండరే! ॥చేడె లంద తీడ॥ 4

ఇపుడు కృష్ణుఁ డిటకు వస్తె యెట్ల వుండునే?
మన, తపములన్నీ వరుసగా నీ - ధరను బందునే! ॥చేడె లంద తీడ॥5
తరిగొండ నారసింహుని శరణుఁ బొందరే!
సొరిదీగాఁ గృష్ణునిఁ దెచ్చి - చూపుమనారే! ॥చేడె లంద తీడ॥6

## 96

విషయము : కొలనిలోనున్న గోపికలకు, మ్రానిపైనున్న శ్రీకృష్ణునకు సాగిన సంభాషణ (జలక్రీడా విలాసము)

### దరువు, ఆదితాళం, మధ్య కాలం

శ్రీకరముగ మీ చీరల నిచ్చితె - నా కాదాయం బేమే?
మఱి నా కాదాయం బేమే? భామా! 1
మాకూ చీరల నిచ్చిన నీకూ పుణ్యమురా!
మఱి, నీకూ పుణ్యమురా! కృష్ణా! 2
చీరలు మీ కిచ్చిన, నా కావల - మీ రేమిత్తురె? భామా!
మఱి, మీ రేమిత్తురె? భామా! 3
తరిగొండాధీశ్వర! నీ వడిగిన - దిరవుగ నిత్తుమురా! కృష్ణా!
మే, మిరవుగ నిత్తమురా! కృష్ణా! 4

## 97

విషయము : శృంగారవనపాలకుడైన వికటభాషణునకు, శ్రీకృష్ణునకు కొనసాగిన సంభాషణ (విష్ణు పారిజాతము)

ఎందుండి వచ్చి తిటకు - కృష్ణదేవా? నీ వా
చందముఁ దెలుపవయ్య! - కృష్ణదేవా! 1

సత్యభామ నగరినుండి - వికటభాషణా! ఇటకు
చరియింప వచ్చినారా! - వికటభాషణా! 2

సత్యభామ యెటువంటిది? - కృష్ణదేవా! నీ వా
చక్కఁదనమూఁ దెలుపవయ్యా! - కృష్ణదేవా! 3
ఆ భామ చక్కఁదనమూ - వికటభాషణా!
చెప్పేనంటే అలవి గాదు - వికటభాషణా! 4

తరిగొండేశ! వేంకటేశ! - కృష్ణదేవా! చెప్పఁ
దరమైనంత - చెప్పవయ్యా! కృష్ణదేవా! 5

## 98

***విషయము : చెలికత్తె సత్యభామను శ్రీకృష్ణునిచేత ఇప్పించగోరిన సొమ్ములు***

***(విష్ణుపారిజాతము)***

సీ. అనిశంబు తరిగొండ హరి కథల్ వినుటలే
పొలఁతి! కర్ణములకు భూషణములు,
ఏ వేళ శేషాచలేంద్రునిఁ జూచుటే
పొసఁగ నేత్రములకు భూషణములు,
ఘన విష్ణునామ కీ - ర్తనములు చేయుటే
పొలుపొంద వాక్కుకు భూషణములు,
పూని కల్గిన వేళ దానముల్ సేయుటే
బోఁటి! హస్తములకు భూషణములు

.గీ. కనుక నీ నాల్గుఁ గోరెదఁ గమలగంధి!
శాశ్వతము గాని భూషణచయము లొల్ల;
దేవదేవుని నిటకు నేఁ దెచ్చినపుడు
చెప్పి యిప్పింపు మవి యెల్లఁ జిగురుఁబోణి!

## 99

విషయము : సత్యభామకు శ్రీకృష్ణుడు పంపిన ప్రత్యుత్తరం

(విష్ణుపారిజాతము)

### సీసమాలిక.

శ్రీమదఖండలక్ష్మీ మనోహరులైన
విశ్వతోముఖులైన విమలులైన
అఖిలాండకోటి బ్రహ్మాండనాయకులైన
సర్వజ్ఞులైన శ్రీస్వామివారు
శ్రీసత్యభామ కాశీర్వాదములు పెక్కు
రూఢిఁ జేసితి, మీ నిరుద్ధమునకుఁ
గుశలంబు మాకు, నీ కుశలాతిశయములు
వ్రాసి పంపుచును రావలెను తెలియఁ
దరువాత నీవు మోదంబుతో వ్రాసిన
లిఖితవృత్తాంతంబు లెస్స దెలిసె.
చెంతఁ జేరిన వేళ 'ఛీ పొమ్ము! పో' మ్మని,
'రమ్ము రమ్మ'ని మళ్లి వ్రాసినావు;
మొనసి పొమ్మనిపించుకొనివచ్చి, మగుడి నీ
చెంతఁ జేరను నాకు సిగ్గు గాదె?
ఎవ్వరైనను విన్న నవ్విపోదురు గాని,
రాను దేవకుజంబుఁ దెచ్చుకొఅకు,

నీ విధంబులు మది నుంచి యింక నీవు
వ్రాయఁదగు సంగతులు మాకు వ్రాసి పంపు!
మహిగిరీంద్రుఁడఁ, దరిగొండ హరి నటంచు
బాల! నాయెడ దయయుంచు సత్యభామ!

## 100

**విషయము : సత్యభామకు, కొఱవంజి (సింగి) కి కొనసాగిన సంభాషణం.**

**(విష్ణు పారిజాతము)**

### దరువు, జంపె తాళం

ఏమె ఓ కొఱవంజి! – యెందుండి వచ్చితివి?
యేమి నీ పేరు? నా – కెఱిఁగింపవమ్మా! 1

అల ప్రైఁడికొండనుం – డిచ్చటికి వచ్చితినె!
పలుకు సింగెందురే! – భామ నా పేరు. 2

కంజాక్షి! నీ పేరు – ఘనతరంబుగ వింటి,
మంజుభాషిణిరొ! నీ – మగని పేరేమే? 3

చెలఁగి యా పేరంటె – చెప్పసిగ్గౌ, నైన
నలుపయిన సింగఁడే – నా మగని పేరు. 4

అత్త, మామల పేరు – లనువందఁ జెప్పవే!
మత్తేభయాన! విన – మనసు బుట్టినది. 5

చెలువ! తరిగొండ నర – సింగఁడే మా మామ,
మలయు కలుముల సింగి – మా యత్త పేరు. 6

## 101

విషయము : ఎఱుకత యిష్టదేవతాస్తుతి (విష్ణుపారిజాతము)

### మంజరి

i) శ్రీవేంకటప్పయ్య! - చెంచూల వోబా!, శ్రీకాశి విశ్వేశ!-శ్రీశైలమల్లా!
శ్రీకాళహస్తీశ!-చెంగల్వరాయా!, మన్నారు రంగ! శ్రీ-మద్దులేటయ్యా!
గోరంట్ల మాధవ!-గోవిందరాజా!, కంచి కామాక్షమ్మ!-కనక వల్లెమ్మా!
వాసి కెక్కిన బెజ-వాడ దుర్గమ్మా!, సరస నందవరాఢ్య- చౌడేశ్వరమ్మా!
మధుర మీనాక్షమ్మ!-మంగ తాయరమ్మా! కులదైవమైనశ్రీ-కొల్లాపురమ్మా!
తరిగొండ హరి యాజ్ఞ- ధరియించి వచ్చి, మన్నించి యందఱు-
మంచి వాక్కియరే!

### దరువు, ఆది తాళం

ii) గురుసామి! నీవు నా-గుఱి దప్పనియక, నా గురి దప్పనియక
వరుసాగ నిజమైన-వాక్కియ్యవయ్యా! 1

దేవళ్లందఱూను నా-దిక్కూకుఁ దిరిగి, నా దిక్కూకుఁ దిరిగి
వావిరి సల్లాని-వాక్కియ్యరయ్యా! 2

తరిగొండాధిప! నీవు-దయతోడ వచ్చి, నీవు దయతోడ వచ్చి
వరమిచ్చి సక్కని- వాక్కియ్యవయ్యా! 3

## 102

**విషయము : స్వర్గలోకమందలి నందనవనంలో శ్రీకృష్ణుడు సత్యభామతో సంతోషంగా పల్కిన పల్కులు (విష్ణుపారిజాతము)**

### దరువు, ఆది తాళం

ఈ వన శృంగార - మింపుగఁ జూడవే! సత్యభామా! నీకుఁ
గావలసిన పూలు - గ్రక్కునఁ గోయవే! సత్యభామ! 1

కుందరదన! దేవ - కుజ మిది చూడవే! సత్యభామా! నీ
విందుకే గద? నన్ను - బొంద రానంటివి, సత్యభామా! 2

'తరిగొండ హరి! శేష-గిరివాస! ర'మ్మని సత్యభామా! నన్నుఁ
గరుణించి యిఁకనైనఁ - గౌఁగిలించెదవటే? సత్యభామా! 3

## 103

**విషయము : శ్రీకృష్ణ దేవేంద్రుల యుద్ధమును విరమింపజేయు నిమిత్తమై పరమేశ్వరుని రాక (విష్ణుపారిజాతము)**

### దరువు, ఆది తాళం

వచ్చె నంది వాహనుఁడై - వామదేవుఁడూ, చాలా ॥పల్లవి॥

హెచ్చుగ నింద్రునికి, హరికి - మచ్చికఁ జేయదలఁచి
॥వచ్చె॥ఉపపల్లవి॥

'నిలునిలు మింద్రా! - నీ విట్లా ఛలముచే సాధించేవా? నీ
కులిశాయుధము వేయవలదూ - నలినాక్షునిమీఁద' ననుచూ
॥వచ్చె॥ 1

'తాళుతాళు కృష్ణా! యిట్లా – తామస గుణమున కిది
వేళ గాదు, వేళ గాదు – వేయవద్దు చక్ర' మనుచూ ॥వచ్చె॥2

'దేవేంద్రా! నీవు శ్రీకృష్ణ – దేవుని ప్రభావ మాత్మ
భావించి, శరణుఁ బొందు – పదరావద్దు, వ'ద్దనుచూ ॥వచ్చె॥3

'కుంభినీశ! శ్రీకృష్ణ! నీవు – జృంభణముతో చక్రమును
దంభోళిపై నట్లేయఁ – దగదు, తగ'దనుచూ ॥వచ్చె॥4

'సురపతి! నీ వీవిధానఁ – దరిగొండా నారసింహుని
నరునిఁగాఁ దలఁచి యేల – విరసముఁ జేసే'వనుచూ ॥వచ్చె॥5

## 104

**విషయము : దేవేంద్రుడు శ్రీకృష్ణ, మహేశ్వరులను (హరిహరులను) స్తుతింపగా, ఆ యిరువురు అంగీకరించి మన్నించటం (విష్ణుపారిజాతము).**

ద్విపద. 'జయ రమాహృదయేశ! – జయ చిత్ప్రకాశ!
జయ తరిగొండేశ! – జయ వేంకటేశ!
జయ రజతాద్రీశ! – జయ పార్వతీశ!
జయ సర్వభూతేశ! – చంద్ర సంకాశ!
జయ నిఖిలాధ్యక్ష! – జయ పంకజాక్ష!
జయ దితి సుత శిక్ష! – జయ భక్త రక్ష!
జయ సత్య చారిత్ర! – జయ ఫాలనేత్ర!
జయ పరమ పవిత్ర! – జయ పంచవక్త్ర!
మీ రిద్ద రెపుడు నా – మీఁద సత్కరుణ
గౌరవంబుగ నుంచి – కడతేర్చ రయ్య!'
యనుచుఁ బ్రార్థింపఁగా, – నా హరి హరులు

వనమున మెచ్చి స - మ్మతి నిట్టులనిరి
'భళి! భళి! యింద్ర! - నీ - భక్తిభావంబు
కలకాల మాత్మలోఁ - గా నుంచుకొనుము!
మురువుఁ జూపు రజస్త - మోగుణంబులను
నిరసించి, సాత్త్విక - నిష్ఠఁ గైకొనుము!
పరఁగ నహంకార - పటిమఁ బోవిడిచి
నిరహంకృతిగ నేలు! - నీ రాజ్య పదము'
అని పల్కు తరిగొండ - హరిని, శంకరునిఁ
గనుఁగొని యింద్రుఁ డు - త్కంఠ నిట్లనియె:

## 105

*విషయము : ఇంద్రుని శరణాగతి, వీడుకోలు (విష్ణుపారిజాతము)*

i) తే.గీ. వందనము సర్వభూతాత్మ! వందనంబు
వందనము విశ్వపరిపూర్ణ! వందనంబు
వందనము సత్య సంకల్ప! వందనంబు
వందనము కృష్ణ! పదివేల వందనములు
స్వామి! గోవింద! మాధవ! శరణు శరణు
చంద్రశేఖర సన్మిత్ర! శరణు శరణు
వరద! తరిగొండ నరసింహ! శరణు శరణు.

### దరువు, ఆది తాళం

పుండరీకాక్ష! ఫాలాక్ష! - పోయివచ్చేను, మీ ॥పల్లవి॥
యండఁ బాయక నారాజ్య - మనుభవించేను ॥ఉపపల్లవి॥

దండము నా స్వాములారా! - దండాము, దండాము మీకు
కుండలీంద్ర శయన!, ఘన - కుండలీంద్రాభరణ! వికచ
॥పుండరీకాక్ష!॥ 1

శరణు మేరుధీరులారా! - సకల లోకాధారులారా!
పరమపూరుషులారా! - చాలా కరుణ నుంచుఁడీ! నా మీఁద
॥పుండరీకాక్ష!॥ 2

తరిగొండనగర నివేశ - గురుతర కైలాసాధీశా!
చిరతరముగ నన్నుఁ - బరిపాలనముఁ జేయుఁ డింక
॥పుండరీకాక్ష!॥ 3

## 106

*విషయము : తిరుమలను ప్రప్రథమంగా సందర్శించినప్పుడు కవయిత్రి చెప్పిన పద్యం (ఆశురచన)*

సీ. శృంగారరాయని చెలువు మీఱిన కొండ
ఫణిరాజు పేరిటి పసిఁడి కొండ
ఘోరపాప మణంచు కోనేర్లు గల కొండ
తలఁచిన మోక్షంబు తగులు కొండ
చిలుకలు కోయిలల్ చెలఁగి కూసెడి కొండ
మృగజాతికోట్లెల్ల మెలఁగు కొండ
పుష్పజాతుల విష్ణుఁ బూజింపఁగల కొండ
కల్పవృక్షము లైదు కలుగు కొండ

తే.గీ. అమరవరులకు నాధారమైన కొండ
ఆళువార్లకుఁ బ్రత్యక్షమైన కొండ
అలరఁ జూచిన బ్రహ్మాండమైన కొండ
ఏను కనుఁగొంటి శ్రీ వేంకటేశు కొండ.

## 107

విషయము : వేంకటేశ్వరస్వామిని ఉద్దేశించి కవయిత్రి చెప్పిన గేయం
(ఆశు కవిత)

ఏమయ్యా? శ్రీవేంకటేశ్వరా! నే నిం
కేమి సేతుర? జగదీశ్వరా! ॥పల్లవి॥

మోక్ష మిచ్చెదవని వచ్చితీ, వచ్చి
ముందుగా నీ శరణుఁ జొచ్చితీ, మిమ్ము
వీక్షించి, కృతులు గావించితీ; దీని
కాక్షేపములు చేసే యట్టి వారలచే దయా
దాక్షిణ్యములు లేక దబ్బుఱ లాడించే వి॥దేమయ్యా?॥ 1

పరులు నాపై నిందఁ జేసిరో? నేను
పరులమీఁదను నింద వేస్తినో? నన్ను
పరులిందు శపియించుచున్నారో? నేను
పరులను శపియింపుచున్నానో?
వరద! తప్పుండినా వారిని రక్షించు!
నేర, నాలో తప్పుంటే నీవే దండించుమీ! ॥యేమయ్యా?॥ 2

బలవంతులకు వారు సాయము, మున్ను
పలికి, పొందుదు రంద రాదాయము;
పేద, పరదేశులని తృణప్రాయము,
నిలిచీ, ధర్మాధర్మములు విచారించవు;
కలకాలము పోరు కలుగఁజేసే వి॥దేమయ్యా?॥ 3

ఘనమోక్ష మిచ్చినఁ జాలును, నా
కెక్కడి కామక్రోధాదు లింకేలను? నీ విం
దనుమానించక సెలవిస్తేనూ
బలసి ఋణానుబంధమున్న చోటను
మునుపటి వైరాగ్యమును మించి క్రమ్మఱి
నిన్నుఁ జెందు జ్ఞానము నే విచారించెదా ॥ఏమయ్యా?॥

## 108

**విషయము : తిరుమల దేవాలయంలో ఏకాంతసేవావేళలో ఈ భక్త కవయిత్రి శ్రీవారికి హారతి యిస్తూ పాడుతూవుండిన మంగళ గీతిక (ఆశు రచన)**

### ముత్యాల హారతి పాట

శ్రీపన్నగాద్రివర శిఖరాగ్ర వాసునకు
పాపాంధకార ఘన భాస్కరునకూ,
ఆ పరాత్మునకు నిత్యానపాయినియైన
మా పాలి అలమేలు మంగమ్మకూ
జయ మంగళం నిత్య శుభ మంగళమ్,
జయ మంగళం నిత్య శుభ మంగళమ్. 1

శరణన్న దాసులకు వరమిత్తునని బిరుదు
ధరియించియున్న పర దైవమునకూ,
మరువల దీ బిరుదు నిరతమని పతిని

[1]ఏమరనియ్య నలమేలు మంగమ్మకూ
జయ మంగళం నిత్యశుభమంగళమ్,
జయ మంగళం నిత్య శుభ మంగళమ్.

ఆనంద నిలయమం దనిశంబు వసియించి
దీనులను రక్షించు దేవునకునూ,
కానుకల నొసఁగూర్చి ఘనముగా విభుని స
న్మానించు అలమేలు మంగమ్మకూ
జయ మంగళం నిత్య శుభ మంగళమ్,
జయ మంగళం నిత్య శుభ మంగళమ్.

పరమొసఁగ నా వంతు నరుల కని వైకుంఠ
మరచేత చూపు జగదాత్మునకునూ,
సిరు లొసఁగ తనవంతు సిద్ధమని నాయకుని
ఉరముపై కొలువున్న శరధిసుతకూ
జయ మంగళం నిత్య శుభ మంగళమ్,
జయ మంగళం నిత్య శుభ మంగళమ్.

తెలివితో ముడుపు లిటు తెమ్ము తెమ్మని పరుష
నళికించి కైకొనెడి అచ్యుతునకూ,
ఎలమి పాకంబుఁ జేయించి [2]అందర కన్న
మలయ కెపు డొసఁగే మహామాతకూ
జయ మంగళం నిత్య శుభ మంగళమ్,
జయ మంగళం నిత్య శుభ మంగళమ్.

---

1. ఏమరనియ్యని+అలమేలు మంగమ్మకూ– అని పద విభాగము.
2. అందరకు+అన్నము+అలయక+ఎపుడొసఁగే– అని పద విభాగము.

మఱియు చిత్ర విచిత్ర మంటపావళులకును,
తిరువీథులకు, దివ్య తీర్థములకూ,
పరంగ ఘన గోపుర ప్రాకారతతులకును,
చిరములై తగు కనక శిఖరములకూ
జయ మంగళం నిత్య శుభ మంగళమ్,
జయ మంగళం నిత్య శుభ మంగళమ్. 6

తరచైన ధర్మసత్రములకును, ఫలపుష్ప
భరిత శృంగారవన పంక్తులకునూ,
మురువొప్పు ఉగ్రాణములకు, బొక్కసములకు,
సరసంబులగు పాకశాలలకునూ
జయ మంగళం నిత్య శుభ మంగళమ్,
జయ మంగళం నిత్య శుభ మంగళమ్. 7

అహివైరి ముఖ్య వాహనములకు, గొడుగులకు,
రహి నొప్పు మకర తోరణములకునూ,
బహువిధ ధ్వజములకు, పటువాద్య వితతులకు,
విహిత సత్కల్యాణ వేదికలకూ
జయ మంగళం నిత్య శుభ మంగళమ్,
జయ మంగళం నిత్య శుభ మంగళమ్. 8
దర చక్ర ముఖ్య సాధనములకు, మణిమయా
భరణ దివ్యాంబర ప్రతతులకునూ,
కర చరణ ముఖ్యాంగ గణ సహితమై, శుభా
కరమైన దివ్య మంగళ మూర్తికీ
జయ మంగళం నిత్య శుభ మంగళమ్,
జయ మంగళం నిత్య శుభ మంగళమ్. 9

కలిత సుజ్ఞానాది కల్యాణగుణములకు,
బలమొప్పు నమిత ప్రభావమునకూ,
వలగొనిన సకల పరివార దేవతలకును,
చెలఁగి పనులొనరించు సేవకులకూ
జయ మంగళం నిత్య శుభ మంగళమ్,
జయ మంగళం నిత్య శుభ మంగళమ్. 10

అలరఁగా బ్రహ్మోత్సవాదులై సంతతము
వలనొప్పు నిత్యోత్సవంబులకునూ,
పొలుపొందు విశ్వప్రభుత్వ మూలంబునకు,
నలువొందు వర విమానంబులకునూ
జయ మంగళం నిత్య శుభ మంగళమ్,
జయ మంగళం నిత్య శుభ మంగళమ్. 11

అరయ తరిగొండ నరహరి యగుచు నందరికి
వరము లొసఁగే శ్రీనివాసునకునూ,
మురియుచును విశ్వతోముఖు నిట్లు భరియించి
సిరుల వెలయుచునుండు శేషాద్రికీ
జయ మంగళం నిత్య శుభ మంగళమ్,
జయ మంగళం నిత్య శుభ మంగళమ్. 12





## తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.



# శ్రీవేంకటేశ్వర నిత్య లడ్డూ దానం పథకం

**సమీక్ష:** శ్రీవేంకటేశ్వర నిత్య లడ్డూ దానం పథకం 1981లో ప్రారంభమైంది. యాత్రికులందరికీ అన్న ప్రసాదం ఇవ్వడం పూర్తయ్యాక (25 గ్రాముల) లడ్డు ప్రసాదాన్ని ఉచితంగా ఇవ్వడం ఈ పథకం ముఖ్య ఉద్దేశం.

**విరాళం వివరాలు :**

ఈ పథకానికి భక్తులు లక్ష రూపాయలు కానీ, అంతకు మించి కానీ విరాళంగా ఇవ్వాలి. విరాళాలను ఒక జాతీయ బ్యాంకులో డిపాజిట్ చేసి, వాటిపై వచ్చే వడ్డీలను దాత పేరున 25 గ్రాముల బరువుండే 25,000 లడ్డూలు తయారు చెయ్యడానికీ, వాటిని భక్తులకు పంచడానికీ ఉపయోగిస్తాం. విరాళాల మొత్తానికి "ది ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్, ఎస్.వి. నిత్య అన్నదానమ్ ట్రస్టు" పేరున చెక్కు/డి.డి. తీసి, "సెక్రటరీ & డిప్యూటీ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్, ఎస్.వి. నిత్య అన్నదానం ట్రస్ట్, టి.టి.డి. అడ్మినిస్ట్రేటివ్ బిల్డింగ్స్, తిరుపతి - 517 510 ఫోన్: 0877-2230004, 2231777 ఎక్స్‌టెన్షన్ 4375" అనే చిరునామాకు పంప మనవి.

**సౌకర్యాలు :**

రూ॥ లక్ష లేక అంతకు మించి విరాళమిచ్చే దాతలకు క్రింద తెలిపిన సౌకర్యాలు కల్పిస్తాం.

1. దాతకూ, వారి కుటుంబానికీ సంవత్సరానికి ఒక రోజు వీలునుబట్టి ఏ.ఆర్.పి. కౌంటర్‌లో కానీ, వి.ఐ.పి. బస వసతి కానీ (డబ్బు చెల్లించే పద్ధతిలో) కల్పిస్తాం.
2. దాతనూ, అతని కుటుంబాన్నీ (ఐదుగురికి మించకుండా) ఏడాదికి ఒకమారు వైకుంఠం క్యూ కాంప్లెక్స్ 1లోని సెల్లార్ ద్వారా స్వామి వారి దర్శనానికి అనుమతిస్తాం.
3. దాత దర్శనానికి వచ్చినప్పుడు ఏడాదికి ఒకమారు 6 చిన్న లడ్లు, 6 వడలు దాతకు ప్రసాదంగా ఇస్తాం.
4. ఈ సౌకర్యాలన్నీ వ్యక్తులకు జీవితాంతం, సంస్థలకు 20 ఏళ్ల పాటు లభిస్తాయి.

Published by Sri K V RAMANACHARI, I A S , Executive Officer
T T Devasthanams and Printed at Sri Parasaraya Press, Sri Vyasasramam